# కృతి సమర్పణము



శ్లో॥ కర్పూర వీటికామోద
సమాకర్ష త్కకుప్తటే!
గృహాణ లలితాదేవి!
"నాటికానాం తు పేటికామ్"॥

# విషయ సూచిక

# తొలి పలుకు

బాలబాలికా విద్యార్థులు 10 లేక 15 నిమిషములలో నటించుటకు ఉపయుక్తములగు బాల నాటికలు మన తెలుగు భాషలో కొన్నిఉన్నాయి. అవి బాలబాలికలకు అందుబాటులో లేవు. ఆ లోపమును తీర్చుటకు నా యీ ప్రయత్నము !

దీని వలన కలుగు లాభములు :— (1) సామెతలు, పద్యములు ముఖపాఠమగుట. (2) కొలది సమయములోనే చాలమంది స్త్రీ పురుష భేదము లేక పాల్గొన గల్గుట. (3) వేదికా నిర్మాణమునందును, వేషాలంకరణమునందును నిర్బంధము లేకుండుట. (4) పాత్రధారులు తమ పాత్ర విషయమును కొలది సమయములోనే ముఖపాఠము చేయగల్గుట. (5) పద్యములు శ్లోకములు చదువజాలని వారు వానిని విడిచి వేసినను కథకు భంగము లేకుండుట. (6) హాస్యము శిష్టసమ్మతముగను, నీతి బోధకముగను ఉండుట. (7) సమయాభావమునందు కళాశాల విద్యార్థులు కూడా ఉపయోగ పరచుకొన గలుగుట. (8) వేర్వేరు విషయములలో వేర్వేరుజాతుల యొక్క సంభాషణ భేదమును గ్రహింప గల్గుట. మొదలగు లాభములు దీనినుండి కలుగును. ఈ నా కృషిలో నేనెంత కృతార్థత నందితినో పాఠక మహాశయులును బాలవిద్యార్థులును నిర్ణయించెదరు గాక !

అంబరు చరఖాలు, రాత్రి పాఠశాలలు, బ్లాక్ డెవలప్‌మెంటు శాఖ, సోషలు ఎడ్యుకేషను డిపార్టమెంటు వారును ప్రచారార్థముగా "ఎత్తుకు పైయెత్తు" మొదలగు నాటికలను ప్రదర్శించి లాభమునుపొందవచ్చును.

నాకు అమూల్యాభిప్రాయముల నొసగి నన్ను ప్రోత్సహించిన శ్రీ రేడియో అన్నయ్యగారు మొ. వారికిని నాకు సలహాలనిచ్చిన ఉపాధ్యాయ సోదరులకును శ్రీ కృష్ణార్జునుల ఫోటోను మాకు ముద్రింప నిచ్చిన శ్రీమతి లక్ష్మీరెడ్డి గారికిని (ఉషా మ్యాగ్జైను సంపాదకురాలు), నా హృదయ పూర్వకములగు నమోవాకములు.

ఇట్లు

రచయిత.

శ్రీరస్తు

# గ్రంథ కర్తృ పరిచయము

## యన్. యన్. శాస్త్రి, M.A.L.L.B, B. T.

లష్కరుబాజారు హైస్కూలు ప్రధానోపాధ్యాయులు

హనుమకొండ, వరంగల్లు జిల్లా.

శ్రీశాస్త్రిగారు నా జ్యేష్ఠ సోదరులు. జన్మస్థలము తూ.గో. జిల్లా రాజోలు తాలూకా ఆదుర్రు గ్రామము. కీ॥ శే॥ శ్రీమతి సుభద్రా సోమపీథిని. వెంకట సోమయాజులుగార్లు జననీ జనకులు-12-4-1902 జననము. సోదరులు నలువురు. భార్యా ద్వయము నుండి ఆర్గురు పుత్రులు, ఆర్గురు పుత్రికలు.

వేదగురువులు కీ॥ శే॥ ఉపాధ్యాయుల లక్ష్మీగణపత్య వధానులు గారు. శాస్త్రి, మంత్రశాస్త్రి గురువులు కీ॥ శే॥ కజ్జా అగ్నిహోత్ర శాస్త్రిగారు. సాహిత్య గురువులు మ.కా.సో. గారు.

1938 నుండి 24-4-1957 వరకు 18 సం. లు హైదరాబాదు లోని వివేకవర్ధినీ, వి. వి. ఎక్సెల్షియరు ఉన్నత పాఠశాలలలో ఆంధ్రో పాధ్యాయులుగా పనిచేసి విశ్రాంతిని తీసికొని మరల 10-6-1957 నుండి హైదరాబాదులోని మదరసే అయిజా ఉన్నత పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా పనిచేయు చున్నారు.

సంస్కృత, హిందీ, మహారాష్ట్ర భాషా వేత్తలు. వేదశ్రౌతములు అభిమాన విద్యలు, వైద్య, జ్యోతిష, మంత్ర శాస్త్రములు ఆనుషంగిక విద్యలు. శ్రీ లలితాదేవీ భక్తులు.

వీరి ముద్రిత రచనలు : హ్రీంకార శతకము. తెలుఁగు సామెతలు, నాటికల పేటిక, రెండు ఏకాంకికలు, కట్నాలకట్టడి, వేద సూక్తులు మొదలగునవి.

వీరు వయోవృద్ధులైనను గ్రంథ రచనము నందును, విజ్ఞాన ప్రసారమునందును యువకులలోలేని చైతన్యోత్సాహములను ప్రదర్శింతురు. ప్రస్తుతము హైదరాబాదులో స్థిరనివాసము నేర్పరచు కొనను న్నారు.

వీరు చేయు కృషి దేశకళ్యాణమునకు తోడ్పడగలదని ఆశించు చున్నాను.

"కృష్ణ పక్షము" కూడ సముల్లసితముచేసిన

భావుక కవి తల్లజులు

# శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

మరియు

"కాంతం కైఫీయత్తు"ను సొంతం అందజేసిన

# శ్రీ "మునిమాణిక్యం" గార్ల ముని వచనములు.

(ఆలిండియా రేడియో ఆఫీసు, హైదరాబాదు ఆ. ప్ర.)

శ్రీ శిరోమణి నూకల సత్యనారాయణ శాస్త్రిగారిచే రచింపబడిన "నాటికల పేటిక" అను పది హాస్య నాటికలను చదివి ఆనందించితిమి. ఈ విధమగు హాస్యము మా మనస్సును మిక్కిలి ఆకర్షించినది. అన్నిటిలోను "మాయ మంగళ సూత్రము" అనునది 'క్లైమాక్స్'గా అగ్రస్థానము నలంకరించియున్నది. ఈ రచనలోని హాస్యము సభ్యమును, సర్వోత్తమము నైయున్నది. సంస్కృతములో నిగూఢముగా నున్న విషయములను హాస్య సంభాషణ రూపమున బాలురకు విజ్ఞానము బోధింపబడినది. ఇవి అన్ని పాఠశాలల యందును ప్రదర్శింప తగియున్నవి.

ఈ పుస్తకము విద్యార్థుల కెంతైనను ఉపయోగము. ఇది ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వమునందలి అన్ని గ్రంథాలయములందును ఉంచతగిన పుస్తకమని మా విశ్వాసము. శ్రీ శాస్త్రిగారి కృషి ఎంతయును ప్రశంసింప తగినది.



సూచన :—వీనిని నటింప నెంచినవారు రచయితకు తెలిపి ప్రదర్శించు కొనవచ్చును.

(ఇవి ఇందీలో కూడ అనువాదము చేయబడు చున్నవి.)

తెలంగాణా వైతాళికులు

# శ్రీ "దాశరథి"గారి ఆశయము

ఆలిండియా రేడియో ఆఫీసు, హైదరాబాదు-(ఆం. ప్ర.)

ఆప్తులు శిరోమణి శ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిగారు రచించిన "నాటికల పేటిక"ను చూచినాను వీరు ఇదివరకు ప్రచురించిన 'తెలుగు సామెతలు" "రెండు ఏకాంకికలు" మొదలైనవి కూడ చూచియున్నాను.

శ్రీ శాస్త్రిగారు "హ్రీంకార శతకం"వంటి ప్రౌఢకవితా రచనలందే గాక, పిల్లలకోసం చక్కని హాస్య రసపూరితములైన నాటికలు రచించడం లోను సిద్ధహస్తులు.

ఈనాడు ఆంధ్ర దేశములో బాలసాహిత్యం చాలా తక్కువగా ఉంది. బాలసాహిత్యం ఎక్కువగా ఉత్పత్తి కావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ దృష్ట్యా శ్రీ సత్యనారాయణ శాస్త్రిగారి కృషి ఎంతైనా ప్రశంసించ తగివుంది.

ఈ "నాటికల పేటిక" అన్న పుస్తకంలో పది చిన్న నాటికలు వున్నాయి. ఇవి పిల్లలు ప్రదర్శించడానికి ఎంతో యోగ్యంగా వున్నాయి. సంభాషణలు ఎంతో చురుగ్గా నడిచాయి. "మాయ మంగళ సూత్రం" అన్న తొలినాటికలో వృద్ధవితంతువుకు నిద్రలో మంగళ సూత్రం కట్టడం మొదలగునవి ఎంతో హాస్య సంభరింతగా వున్నాయి. ఈ నాటికలు విద్యార్థులకు, ముఖ్యంగా చిన్న తరగతి విద్యార్థులకు పఠనానికి, ప్రదర్శనానికి చాలా ఉపయుక్తంగా ఉన్నాయి.

శ్రీ శాస్త్రిగారి కృషివల్ల బాలసాహిత్యం సుసంపన్నమై తెలుగు దేశానికి శోభను చేకూర్చుతుందని ఆశిస్తున్నాను.

పాఠశాలలవారు వీటిని వీలైనంత ఎక్కువగా ప్రదర్శింపజేసి విద్యార్థులకు నాటక కళపట్లను. సాహిత్యం పట్లను. ఆసక్తిని పెంపొందింప జేస్తారని ఆశిస్తున్నాను.

# శ్రీ రేడియో అన్నయ్య గారి నాడెమైన అభిప్రాయము

శ్రీ న్యాపతి రాఘవరావుగారు,
ఆంధ్ర బాలానంద సంఘ సంచాలకులు, హైదరాబాదు. A. P.

శ్రీ శిరోమణి నూకల సత్యనారాయణ శాస్త్రిగారిచే రచింపబడిన "నాటికల పేటిక" లోని పది హాస్య నాటికలను ఆ మూలాగ్రముగా చదివి ఆనందించితిని.

మన ఆంధ్రభాషలో బాలవాఙ్మయము చాల కొఱతవడి యున్నది. ఈ మధ్య బాలగేయములు, కథలు చాల ప్రచురితములగుచున్నవి. కాని బాలబాలికలు రంగస్థలముపై ప్రదర్శించుటకు యోగ్యములగు నాటికలు గాని, ప్రహసనములుగాని, విజ్ఞాన వినోద సంభాషణములుగాని అధికముగా ప్రచురింపబడలేదు. ఆ లోపమును ఈ పొత్తము చాలవరకు తీర్పగలదని నా విశ్వాసము.

ఈ హాస్య సంభాషణములో శ్రీ శాస్త్రిగారు సందర్భానుసారముగా ఎన్నియో సామెతలను ఉపయోగపరచి యున్నారు. ఉపోద్ఘాతములో వారు వివరించినట్లు "మన తెలుఁగు బాలబాలికలకు ఈనాటికా ప్రదర్శనము వలన తెలుగు సామెతలెన్నియో కంఠపాఠమగుచున్నవి" అనునది మిక్కిలి ప్రశంసార్హము.

ఈ పుస్తకములోని నాటికలు సమయానుకూలముగా ప్రేక్షకులను దృష్టిలో నుంచుకొని ప్రదర్శించుటకు యోగ్యముగా నున్నవి.

శ్రీ శాస్త్రిగారి ప్రయత్నము మిక్కిలి శ్లాఘనీయము.

ఈ పుస్తకము ముఖ్యముగా పాఠశాలలలోను, డెవలెప్‌మెంటు వారిచే నడపబడు విజ్ఞాన కేంద్రము లందును. సాంఘిక సంక్షేమ సంస్థలవారిచే నడపబడు (బాల్వాడీ) శిశు సంక్షేమ కేంద్రములందును, సోషలు ఎడ్యుకేషను డిపార్టుమెంటు వారిచే నడిపబడు రాత్రి పాఠశాలలందును, బాలానంద సంఘములందును ఉపయోగింప తగియున్నది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వములోని ప్రతి గ్రంథాలయము నందును ఉంచతగిన పుస్తకమని నా విశ్వాసము.

॥ ఓం ॥

# "మాయ మంగళ సూత్రం!"

*("సుందావధానులు, వీరభద్రం సంభాషణ" దీనిలోని పురుష పాత్రలు నాలుగు, స్త్రీ పాత్రలు నాలుగు. ఇద్దరు బాలిక లైనను బాలురైనను ఉండవచ్చును.)*

వీ. సుందావధాన్లూ! రాత్రి శోభనాద్రి గారింట శుభ కార్యం జరిగింది టోయి!

సుం. నువ్వురాలేదేమిరా! ఆ యాజ్ఞీకం నాదే కాదుట్రా? కార్యం సలక్షణంగానే జరిగింది! నువ్వు రాకపోవడమే లోటు!

వీ. బ్రహ్మకట్నం ఏమిచ్చారోయి?

సుం. చీకటి సందులో చూచుకోనే లేదోయి! అర్ధనూట పదహార్లు మొగపెళ్ళివారు చదివించారనుకో!

వీ. వైపులే మొచ్చాయి?

సుం. మొలలోనే పెట్టేశానోయి! ఏమిచ్చారో చూచుకోనే లేదు! చూస్తానుండు ఏమిచ్చారోను.

*(మొల తడుమును. మొలలో నుంచి మంగళ సూత్రాలు వెలువడును. దాన్ని చూచి ఆశ్చర్యాన్ని అభినయించును)*

వీ. ఇదేమిటోయి! మంగళ సూత్రాలే కట్టించడం మరిచిపోయావా ఏమిటీ!

సుం. ఎన్నడూ లేదురా! ఈలాంటి పొరబాటుపని జరిగిం దేమిటి?

వీ. ఎవ రేనా కనుక్కుంటే ఏంగతి ?

సుం. మన మర్యాద దక్కుతుందా ? మళ్ళా ఎవ రేనా పెళ్ళి చేయించమని మన్ని పిలుస్తా రంటావా ?

వీ. పదిమందికీ మొగం చూపించడం ఎట్లాగోయి ! ఎంత అప్రతిష్ఠపని జరిగింది ?

సుం. ఏంచెయ్యాలిరా ఇప్పుడూ ? తెల్లవారిందంటే ఎంత గలభా అవుతుం దనుకున్నావు ?

వీ. ఏదో మాయోపాయంచేసి తెల్లారిలోగా పిల్ల మెడలో మంగళసూత్రం మనమేనా కట్టెయ్యాలి !

సుం. పెళ్ళి కూతు రెక్కడ పడుక్కుందో చూశేనారారా, ఆలోచిద్దాం.

*(వీరభద్రం వెళ్ళి చూచి వచ్చును)*

వీ. వాళ్ళ ముసలమ్మ పక్కలో పడుకుందోయి !

సుం. అయితే నడు, సులభోపాయం తోనే పని జరుగొచ్చు. "దీపం తీస్తే సరుకు సమానమేగా!"

*(ఇద్దరును వెళ్ళి దీపం ఆర్పి చీకటిలో పిల్ల మెడకు బదులుగా రంగమ్మ అనే ముసలమ్మ మెడలో కట్టి వెళ్ళెదరు)*

*(ఆ అలజడికి ముసలమ్మ లేచి నలుమూలల పరికించి ఎవ్వరులేరని నిశ్చయించి తనలో ఇట్లనుకొనును)*

రం. ఇంకా ఎవరూ లేవ లేనట్లుంది ! అందరూ పెళ్ళి బడలికలో సుఖంగా నిద్రపోయారు ! రెండు మేలుకొలుపు లేనా పాడుకుంటాను. ఈ వెదవ నల్లులూ, దోమలతో మళ్ళీ నిద్రపడుతుందా, ఏమిటా ?

# మేలుకొలుపు పాట
"మేలుకో హరి సూర్యనారాయణా!"
(ధృవపదం)

(1) మందేహ రాక్షసులు—సందేహమే లేక, మందీరమ్మున కలరు—తొందరగ చంపాలి, మేలుకో...ణా!

(2) దాసీలు వచ్చారు – బాసంలూ తోమంగా, మోసా గింతురు కనులు—మూసీకొందువ దేమి? మేలుకో...!

(3) పాలా పొడరు కలిపి—పాలా కావడి తెచ్చి,—పాలావాడే తెంచి-మోరీలా నిలబడ్డాడూ, మేలుకో...ణా!

(4) చిన్నంగ హోటలూలో—నిన్నా మిగిలిన కాఫీ, – మరి గించీ అయ్యారూ, మంచీ పొడరు వేసె,...చూచుకో!

(5) కమ్మాసీ పొడివేసీ – కాఫీ కాచితి చింత, ప్రిక్కనా ములగదూ చక్కెర చక్కగ వేస్తి, త్రాగరా...ణా!

(6) పొడుపూ కొండానుండీ—పడమటికొండా దాకా, నడి మింటా నడిచేవూ, 'నాశ్తా' చేయగ వేగ...మేలుకో!

(7) చాకాలీ సరవమ్మా—చలవా బట్టలు తెచ్చె, సరిచూచూ కోవలెనూ—జాగూచేయక వేగ మేలుకో...ణా!

(8) బిరుసైన గడ్డమునూ—'బ్లేడూ'తో సవరించి, మంగలి కత్తెర వేసీ—రంగుగ 'క్రాపు'ను చేయు, మేలుకో!

శ్లో॥ ఉదయే 'టీ' స్వరూపంచ
మధ్యాహ్నె 'ఉపమా' త్మకం.
'కాఫీ' రూపంతు సంధ్యాయాం
త్రిమూర్తిం 'అయ్యరుం' భజేత్,

ఏమే! వెంకాయీ! ఇంకా లేవరుటే భళ్లున తెల్లారి తేను? ఈకాలం పిల్లలు ఇదేం పిల్లలమ్మా! ఝూాం పొద్దెక్కినా లేవరూ!

తెల్లార్లూ ఏదో గుసగుసలూ బసబసలే! "రాత్రి మాటలు నిద్రకుచేటు, పగటి మాటలు పనులకిచేటు", ఎక్కడినించి ఊరుతాయో ఈ మాటలు!

ఆ. వె. రాత్రి మాటలెల్ల రహి నిద్రకగు చేటు!
పగటి మాటలెల్ల పనికి చేటు!
మగనికగును చేటు మొగమోడు పెండ్లాము!
మసటు దివ్వెయింటి కొసగు చేటు!

(ప్రకాశంగా) బాబిగా! నీకూ నిద్రేనట్రా? ఇల్లారా అమ్మా! పద్యాలు చెబుతానూ.

*(12 ఏండ్ల మనుమడు కనులు నలుపుకొనుచు వచ్చి దగ్గర కూరుచుండును)*

రం. చెప్పమ్మా పద్యం:-"అమ్మల గన్నయమ్మ"

బా. "అమ్మమ్మ కన్న మా యమ్మ"

రం. నీసెత్తి కాయి! అమ్మమ్మ కన్న మీ అమ్మే నాలుగాకు లెక్కువ చదువు కుంది లే!

బా. అమ్మమ్మా! నీ మెడలో మంగళ సుత్రాలెక్కడివే? మా తాత గారెక్కడున్నారో చూపించవు టే?

రం. *(తాను తన మెడలోని మంగళసూత్రాలనుచూచి ఆశ్చర్యపడును)* ఇదేమిట్రా! నా మెడలో మంగళ సూత్రాలెవరు కట్టారా!

బా. తాతగారు కట్టా రేమోనే! అమ్మమ్మా!

రం. మీ తాతగారితోనే పోయాయిరా మంగళ సూత్రాలూ! నేటికి మళ్ళీ వచ్చాయూ అంటే, మీ తాతగారు కూడా మంగళ సూత్రాలతో మళ్ళా వస్తా రన్నమాటే!

బా. రాకపోతే ఏంచేస్తావే అమ్మమ్మా!

రం. రాకపోతే నేనూరుకుంటూనా! ఆ కట్టినవారిని నాకు మనోవర్తేనా ఇవ్వమంటూను, తిండేనా పెట్టమంటూను!

బా. నాకు తాతగారిని చూపించవుటే అమ్మమ్మా!

రం. వస్తారుండరా; చూపిస్తానూ. (తనలో) నేటితో నాకు ఈ వెధవరిక్కం ఒదిలి పోయింది బాబు! ఈ దుఃఖం అనుభవించే వాళ్ళకే తెలియాలి గాని, ఉత్తవాళ్ళకేం తెలుస్తుంది?

ఎవరికేనా ఎదురుగా పోకూడదు కదా! పొద్దున్నే లేవగానే నామొగం ఎవరికంటేనా పడింది అంటే, ఆ రోజల్లా తిట్లూ దీవన్లూ తప్పవు నాకు!

పెళ్ళిళ్ళల్లో పువ్వులూ, భూషణాలూ, బుక్కా-బర్గుండా (గులాలు) ముట్టుకోనీయరు కదా!

ఎన్నాళ్ళయిందో ఆయనగారి మొగంచూచి (దుఃఖించును) ఆ విభూతిరేకలు, ఆ రుద్రాక్షమాల, ఆ పెద్ద పొడుంకాయ, ఆ బిళ్ళకచ్చ, ఆ పిలకజుట్టు నా కళ్ళకు కట్టినట్లే ఉందమ్మా! ఆయిన బొమ్మ!

*(ఇంతలో సురేశ్-రమేశు వచ్చి ఘుట్టూమ్మూగి ఇట్లు ప్రశ్నించెదరు)*

సు. అమ్మమ్మా! నీకుమళ్ళీ పెళ్ళెప్పుడయిందే!

ర. అమ్మమ్మా! తాతయ్య పేరు చెప్పావేం? ఒక్కసారి వింటాను!

సు. మా తాతగారు నీకేమేం వస్తువులు పెట్టారో చూపించవుటే? అమ్మమ్మా!

ర. దంపతి తాంబూలాలు ఎప్పుడిపిస్తారే బామ్మా!

*(పక్కింటి పద్దమ్మగారు ప్రవేశించును)*

ప. ఏమిటి బామ్మగారూ! ఇదీ!

రం. ఏమోనమ్మా! నిద్దట్లో ఎవరో మంగళ సూత్రం కట్టి మాయమై పోయా రమ్మా!

ప. మీ మొహానికెంతో కొత్తందం వచ్చింది బామ్మగారూ! చూచుకోండి!

రం. అద్దమేనా తేర్రా! నా ముత్తయిదు రూపెల్లా ఉందో చూసుకో నేనా చూసుకుంటానూ!

*(రమేశ వెళ్ళి అద్దంతెచ్చి పద్దమ్మగారికి ఇచ్చును)*

ప. బామ్మగార్రూ! ఇదుగో చూసుకోండి మీ చక్కదనం!

*(పద్దమ్మ చూపగా తాను అద్దం చూచుకొని తల తడుముకొని)*

రం. ఆ మంగలి గంగులుగాడే నున్నగా పొన్నకాయ లాగ చేశేశాడమ్మా!

సు. పాట:– "పోయిన మగడూ పోతే పోయెను, పొన్నకాయలా కుదిరిందీ! తల పొన్నకాయలా కుదిరిందీ."

రం. *(వానిని నెత్తిమీద మొత్తును)*

ర. అమ్మమ్మా! పో తంత తాతగారే పోతే అర పిడికెడు జుట్టుకోసం విచారిస్తావేమ?

ఆ. వె. కొండయంత మగడె కూలిపోవగ ముగ్ధ,
అర పిడికెడు జుట్టు కొఱకు నేడ్చె!
కుండ యంతటి తల కోయ నుండగ, చెవి
పోగుల కయి జడుఁడు-పొక్కి-యేడ్చె!

ర. అమ్మమ్మా! 'విగ్గు' పెట్టుకుంటే బాగుంటుందే!

రం. విగ్గేమిట్రా? విగ్గూ బొగ్గూనూ సిగ్గులేక పోతే సరి!

ప. బామ్మగారూ! విగ్గెట్టుకుంటేనే, నెత్తికిసవరం చేసినట్లుంటుందమ్మా! పెట్టుకు చూడండి!

రం. ఆ విగ్గేదిటో తెచ్చి నా నెత్తిన తగలెయ్యనేనా తగలెయ్యర్రా! మళ్ళీ నా మంగళ సూత్రాలు మాయ మవుతాయో ఏమో!

(సురేశ విగ్గుతెచ్చి పద్దమ్మకు ఇచ్చును. పద్దమ్మ దానిని రంగమ్మ నెత్తికి కట్టి అద్దం చూపును.)

(రత్తమ్మ అద్దం చూచుకొని వికారముఖంతో)

రం. ఛీ! ఈ వెధవసైను గుడ్డేమిటర్రా! నా బంగారంవంటి పట్టు చీరుండగాను?

ప. బనారసు పట్టుచీర, బెంగుళూరు రవిక తొడుక్కోరండి బామ్మగారూ!

రం. మీకందరికీ అంత సరదాగా ఉంటే అవి కట్టుకునేనా ఒస్తాను. చూస్తూఉండర్రా! మీ తాతగారు మారు వేషంలో వస్తారో ఏమోను!

(రంగమ్మ వెళ్ళి పోవును)

(పెళ్ళికూతురు, తండ్రి, తల్లి ప్రవేశింతురు)

తం. (కోపంతో) ఏమైనట్టే పిల్లమెళ్ళో మంగళసూత్రాలు?

త. నాకేం తెలుసు నండీ? నా మీద పడతారు మీరూ?

తం. ఇంట్లో ఉన్న దానవు నీకు తెలియకపోతె ఎవరికి తెలుస్తుంది మరి?

త. ఇంట్లో ఉంటే మాత్రం నేను దాన్ని కాపలా కాస్తున్నాను టండీ? వచ్చేవాళ్లనీ, పోయే వాళ్లనీ, మర్యాద చేసి, పసుపు, కుంకం, పాను బీడా, వేనా ఇవ్వకపోతే ఏమనుకుంటారు పేరంటాళ్లు?

తం. అయిందా, పేరంటాళ్ళూ, మర్యాదానూ?

త. ఈ మొగాళ్లకున్న మురిపెమే నమ్మా ఇది! ప్రతీదానికీ ఆడవాళ్ళ మీదపడి అధికారం చెలాయించడమే! చూస్తున్నా కదూ! ఇన్నాళ్ళనుంచీ నీ! (దుఃఖించును)

తం. నేనూ చూస్తున్నాను నీ గరువం! ఏమీ బాగాలేదు నీ వరస-వాలకమూను! జాగ్రత్త!

త. ఇల్లాంటి వాళ్లకి అసలు పిల్లలే పుట్టకూడ దమ్మా!

తం. ఏవరేనా కనమని ఏడిశారా ఏమిటి ఆడపిల్లల్ని!

త. దేముడు ఆడపిల్లల్నే ఇచ్చాడు, నన్నేం చెయ్యమన్నారు?

తం. దేముడు నీకివ్వొచ్చాడేం! ఆడబిడ్డల్ని!

త. దేముడివ్వలేదు పోనీ! మీరే ఇచ్చారులేండి! ఆ తప్పు మీదే! నన్నేమీ అనకండి, నా నోరసలే మంచిదికాదు! తర్వాత నన్నంటే లాభంలేదు!

తం. అయితే పోనీలే తప్పంతా నాదే, సరేనా? ఇంతకీ పిల్లని ఎక్కడ పడుకో పెట్టినట్లు? పిల్లనడుగు ఏమేనా తెలుసునేమో దానికి! దొంగలేవరేనా ఒచ్చారో! ఏ మ్మాయ జరిగిందో!

త. ఏమమ్మా! శ్యామలా! నీ మెడలో మంగళసూత్రా లేమయినాయమ్మా! చెప్పు తల్లీ!

శ్యా. ఏమోనే! నా మెడలో మంగళ సుత్రాలు కట్టినట్లే నాకు జ్ఞాపకం లేదే, అమ్మా!

తం. పీడే పోయింది! ఇంకే ముంది? మొదటికే ఒచ్చింది మోసం!

త. ఎవరి దగ్గర పడుకుందో వాళ్లకేమేనా తెలుసునేమో!

తం. ఆ అనుమానం కూడా తీర్చుకుందాం, నడవండి, ఆవిడెక్కడుందో ఎమిటో చూద్దాం!

ఆ.వె. ఆడుబిడ్డ పుట్టె నన నగు నొక చింత!
పెండ్లి చేయుటన్న పెద్దచింత!
కన్నె సుఖము నంద కున్నదన్నను చింత?
కన్నెఁగనుట కంటెఁ గలదె చింత!

*(ముగురు వెళ్ళి పోవుదురు)*

*(ఒక యాయవారం బ్రాహ్మణుడు ప్రవేశం, విభూతి, రుద్రాక్షలు, పొడుంకాయ, బిళ్లకచ్చ, పిలకజుట్టు ధరించి చేతిలోరాగిచెంబు, ధరించి యుండును)*

యా. సీతారమాభ్యాం నమః. ఈవేళ శ్రాద్ధతిథి, దినవారం, సినీమాతార, సపిండీ కరణం, దగ్ధయోగం, విధవా వివాహాదులకు మిథునకృత్యం రహితం, రాత్రి 8 గంటలకు సూర్యగ్రహణం హస్తాధిక గ్రాసం!

సు. ఓహో! అమ్మమ్మ చెప్పిన ఆనవాళ్లు ఇవేరా! వీరే మన తాతగారేమో రా?

ర. తాతయ్యగారు మారువేషంలో ఒస్తారేమో చూస్తూ ఉండమంది కదుట్రా అమ్మమ్మ?

సు. అవున్రా! అమ్మమ్మకి చూపించేదాకా ఈ తాతయ్యని పోనీ యొద్దురా!

ర. ఒరేయి! నువ్వెళ్లి అమ్మమ్మని తీసుకురా రా! నేనీ తాతగారి దగ్గర కాపలా ఉంటాను.

సు. అయితే ఆయన ఊరు పేరు అంతా అడుగుతూ ఉండు ఇప్పుడే ఒస్తాను అమ్మమ్మని తీసుకొని.

(సురేశ్ వెళ్ళును)

ర. తాతగారూ! మీ పేరేమిటండి, కొంచెం చెబుతారా?

యా. నా పేరు వెంకటశాస్త్రుల్లంటారు నాయనా!

ర. మా తాతగారి పేరూ అదే లేండి! మరయితే మీ అమ్మమ్మగారి రేమిటండీ?

యా. రంగ శాయమ్మ అంటారు బాబు!

ర. మా అమ్మమ్మ పేరు కూడా రంగమ్మే లేండి

యా. మనిషిని పోలిన మనిషీ, పేరును పోలిన పేరూ ఉండొచ్చులే నాయనా!

ర. మా తాతగారు మరణించి ఒక సంవత్సర మైందండి! మీదెంత కాలమైందండి తాతగారూ?

యా. చచ్చిన వాళ్లు బతుకుతారా నాయనా? నాతో పరిహాసం చేయక నన్నుపోనీ బాబు!

ర. మా అమ్మమ్మొచ్చే దాకా మీరిక్కడ నుంచి కదల డానికి వీల్లేదు, తెలుసాండీ!

యా. ఏం నాయనా! మీ అమ్మమ్మెవరో నేనే మెరుగుదును బాబూ!

ర. అదంతా నాకు తెలియదు, మీరు మా అమ్మమ్మని పోషిస్తారా? మనోవర్తి ఇస్తారా! మీ ఇష్టం! ఆలో చించుకోండి వచ్చేస్తూదిం ఆవిడ! అదుగో!

*(ఇంతలో రంగమ్మ చీర, రవిక, విగ్గు, కాటుక, పసుపు, కుంకుమ బొట్టు, గాజులు ధరించి తాంబూలం వేసుకొని మంగళసూత్రం పైట పైకి వేసుకొని వచ్చును)*

ర. అమ్మమ్మా! వీరేనటే మన తాతగారూ!

*(రంగమ్మ వాని దగ్గరకు వచ్చి క్రింది నుంచి మీది దాకా పరిశీలించి చూచును)*

రం. మీరెక్కడ నుంచి వచ్చారండీ ఇన్నాళ్లకీ?

యా. నిన్న రాత్రి పెళ్లికి సంభావన కొచ్చా నండమ్మా!

రం. ఈ మంగళ సూత్రాలు మీరు కట్టిన వేనా?

*(మంగళ సూత్రాలు చేతితో ఎత్తి దగ్గరకు వెళ్లి చూపును)*

యా. ఏమో నమ్మా! నాకేం తెలుసు ఈ మాయ మంగళ సూత్రాలు?

రం. ఈ మాయేమిటో చెప్ప నేనా చెప్పాలి మీరు, లేదా మనోవర్తేనా ఇవ్వాలి !

యా. ఇంటింటా తిరిగి తిరిపె మెత్తుకునే వాణ్ణి నాతో పరిహాస మేమి టమ్మా ? రంగమ్మగారు ?

రం. ఈ ఉళ్ళో మీ రెవరి నెరుగుదురు ? బాబూ !

యా, నిన్న రాత్రి వివాహం చేయించిన సుందావధాన్ల గారి నెరుగుదు నండి !

సు. అమ్మమ్మా ! మన గురువు గారిని పిలుచుకొస్తానే ! వారి నడిగితే తెలుస్తుంది వీరు మన తాత గారే నో కాదోను.

(ఇద్దరు పరిగెత్తుకొని పోయెదరు)

రం. తనలో "ఎదురుగుండా ఉన్నా వాడు పెళ్లి కొడుకు" అన్నట్లు ఇయన ఎవరో పరదేశి బ్రాహ్మణుడే ! కాని ఆ మాట ఇప్పుడే చెప్పేస్తే మళ్ళా పూర్వావతారం ఎత్తవలసి వస్తుంది నేను. ఈ వైధవ్య దుఃఖం శత్రువుల కేనా రాకూడదురా దేవుడా !

(సుందావధానులుగారు బాలురతో ప్రవేశించెదరు)

సు. 'తనలో' ఇదంతా నా అవతార చేష్టలే ! కాని "దొంగకు తేలుకుట్టినట్లు" చప్పుడు చెయ్యకుండా మౌనం వహించి సమయానుకూలంగా ప్రవర్తించు కోవాలి, (ప్రకాశంగా) ఏమిటి రంగమ్మ గారూ ! ఈ అర్ధ సువాసినీ వేష మేమిటి ?

గ౧. ఏమో నాయనా ! ఈ మంగళ సూత్రాలు నిన్న మీరు కట్టినవేగా ? చూడండి ! (చూపును)

సు. 'తనలో' కొంప తీసి నా రహస్యం ఈమెకు తెలియు లేదు గదా ?, (ప్రకాశంగా) ఏమిటి ! మీ మెడలో కొచ్చాయా. నేను పిల్ల మెడలో కట్టించిన మంగళ సూత్రాలూ ?

రం. మీతో అబద్ధ మాడతానా ? బాబు ! ఇదిగో చూడండి మంగళ సూత్రాలు ? ఇదేం మాయో గాని ఎక్కడా చూళ్ళేదమ్మా ఈలాటి శోద్యం !

యా. అవధాన్లు గారూ ! నన్ను నిల కొట్టారు చూశారా బాబూ ! మరో నాలుగిళ్ళైనా తిరుగుదును బాబూ!

సు. వీరి నా పారెందుకు రంగమ్మ గారూ ?

రం. మా కొంటె పిల్లగాళ్ళు తాతయ్యా, తాతయ్యా, అంటూ వారిని ఆడిస్తున్నారు లేండి! (వారివైపు చూచి) మీరు వెళ్లిపోండి బాబు !

యా. బ్రతుకు జీవుడా! "దుర్భిక్షం లో అధిక మాసం" అన్నట్లు ఈ మెను కూడా ఎల్లా పోషించాలి రా దేవుడా ! అను కొన్నాను, నేను లేచిన వేళ మంచిదే అయింది ఈ వేళ !

సుం. రంగమ్మ గారూ! మీరేమీ అనుకోనంటే ఒక్క మాట చెబుతాను.

రం. చెప్పండి బాబు ! నేనేమనుకుంటాను ?

సుం. మీ ఇంట్లో పిశాచ బాధ ఎన్నడేనా ఉన్నట్లు జ్ఞాపక ముందా మీకు ?

(ఆలోచన నభినయించి)

రం. బాబూ ! మా పెద్దమ్మాయి పోయి ఒక సంవత్సర మైందండీ ! అది అప్పుడప్పుడు పిల్లల్ని పట్టుకుని బాధించడం, కలలో కనబడుతూ ఉండడం ఉందండీ ! "చచ్చిన వాళ్ళు దెయ్యాలవుతారా ఏమిటి?" చెప్పండీ ?

సుం. ఈ పెళ్ళికి కులదేవతా స్థాపనం చేసేముందు ఆమె పేరు మీద మీరు ఎవరికైనా చీరగాని, రవికగాని ఇచ్చి కొలిచారా ఆమెను ?

రం. అల్లాంటి దేమీ చెయ్య లేదేమోనండి బాబూ !

సుం. ఇప్పుడేనా మించి పోలేదు ! ఆమె పేరు మీద ఒక ముత్తైదువుకో, ఒక బ్రాహ్మడికో, చీరగాని, చాపు గాని, ఇస్తే మళ్ళీ కనుపించదు. ఆ దయ్యం ! పెద్ద వారు మీరుండీ కూడా ఆమెను మరిచి పోయారని జ్ఞాపకం చెయ్యడానికి మీ మెడలో దయ్యమే మంగళ సూత్రం కట్టి ఉండాలి !

రం. *(వెక్కి వెక్కి ఏడ్చుచూ)*
అమ్మా ! వెంకమ్మ తల్లీ ! నా బుద్ధి గడ్డి తిందమ్మా ! నా కెళ్ళి నేళ్లు ఎవరి కెళ్ళాయి ! నా కళ్లు కాలిపోను ! నాగుడ్లు గుమికి పోను, నిన్ను మరిచి పోయినందుకు తగిన 'శాస్తి' చేశావులే అమ్మా. "కుక్క కాటుకి చెప్పు దెబ్బ" బాగానె కొట్టావులే ! ఇంక బుద్ధొచ్చిందమ్మా నాకు ! ఇంక నిన్ను మరిచి పోతానా ! వెంకమ్మతల్లీ !
*(దుఃఖమును ఉపశమించుకొని)*
సుందావధాన్లు గారూ ! మీ ఆవిడిగారిని రేపు తీసుకు రాండి బాబు! మీకో చీర, ఆవిడకో చాపు, పెడతాను. ఇంకా నిలబడేఉన్నారూ మీరు? వెళ్ళండి బాబు !

సుం. (తనలో) ఒక్క అబద్ధాన్ని నిజం చేయడానికి ఎన్ని అబద్ధాలాడ వలసి ఒచ్చింది! ఇక్కడికీ గండం గడిచింది గదా! ముందు మాట చూచుకోవచ్చు.

(వెళ్ళి పోవును)

రం. (తనలో) "ఒకనాటి పెళ్లికి మొగమెల్లా కాటుక" ట! ఇక్కడి కయింది నా భోగం! "నంబీ! నంబీ! నీ భోగ మెన్నాళ్ళే అంటే! మా అత్త మాలపల్లె నుంచి వచ్చే దాకాను," అన్నట్లయింది నాగతి!

ఆ. వె. మూడు గడియలకగు ముత్తైదు తనమున,
కాలు జోళ్ళ లక్కయాకులేల?
ఒక్కనాటి పెండ్లి కొడలిపై, మొగమున,
నెల్ల కాటుక రేక లేల వలయు?

సు. అమ్మమ్మా! మా తాత గా రేరే?

రం. మీ తాత గారు దెయ్యమయ్యారుట్రా? పోండి, మిమ్మల్ని పట్టుకు పీక్కు తింటారు! (నెత్తి మీద కొట్టును)

సు. అమ్మమ్మా! మా తాతగారు చచ్చారని నువ్వు ఏడవ వేమే? పక్కింటి పద్దమ్మ గారు ఎల్లా శోక న్నాలు తీస్తున్నారో చూడు?

రం. "ఏడ్చేదాని మగడొస్తే నామగడూ వస్తాళ్ళేరా!"

సు. ఆ. వె. విగత భర్తృకవయి–వగవ కుండెద వేల?
అవ్వా! చెంత నుండు–నా మొఁగనుము
వగచు నట్టి దాని–మగఁడేగు దెంచిన
నా మగడును వచ్చి–నన్నుఁగలయు!

ర. అమ్మమ్మా; నీకు మనోవర్తి, దెయ్యం తాతయ్య ఇస్తాడా! బియ్యం–తాతయ్య ఇస్తాడే?

రం. నీ నెత్తి కాయ తాతయ్య, నా బుఱ్ఱకాయ తాతయ్యాను, పో భడవా!

(వానిని నెత్తిపై మొత్తును.)

ఇదిగో నీ విగ్గులు బొగ్గులు గాను,

(తీసి నేలకు కొట్టును)

నీ రవిక రగులుకు పోను! నీ చీర చిరిగి పోను!

(చీర తీసి ముసుగు వేసికొనును)

ర. ఈ పాటికి మంగళ సూత్రాలు, గాజులు తీసేసి మామూలు అవతారం ఎత్తవుటే బామ్మా?

రం. మీ బాధ పడ లేకుండా ఉన్నానర్రా! పోతానుండండి, వెధవ ల్లాలా!

(వెళ్ళి పోవును)

ర–సు. పోయిన మగడూ పోతేపోయెను. పొన్నకాయలా కుదిరిందీ తల.

సమాప్తము



శ్రీరస్తు

# పొట్టి బావ-చిట్టి మరదలు

## (హాస్య సంభాషణము)

*(మరదలు కుర్చీమీద కూర్చుని పేపరు చదువుకుంటూఉండగా బావ ప్రవేశించును. మరదలు ఎదురుగాపోయి స్వాగతమిస్తూ,)*

మ. ఓహో! ఎప్పుడో ఒచ్చారు పొట్టిబావగారు?

బా. ఇప్పుడే ఒచ్చానే చిట్టి మరదలా!

మ. ఎండెక్కొచ్చారా? కొండెక్కొచ్చారా బావగారూ?

బా. ఎండెక్కి రాలేదు, బండెక్కి రాలేదు, పండక్కొచ్చానే!

మ. ఏమోబాబూ! పండక్కి ఒచ్చావో మా దండక్కి ఒచ్చావో! నీదంతా టెక్కు! ఈ పీటెక్కు.

*(కుర్చీమీద కూర్చుండబెట్టి తాను ఎడమవైపు కుర్చీలో కూరుచుండును)*

బా. (కూర్చుని) అవును నాదంతా టెక్కే! మీకు దండగైతే మాత్రం పండగ తప్పుతుందిటే? మరదలా?

మ. తప్పకేమిలే గాని; అసలు మాకూ నీకూ ఉన్న చుట్టరికం ఏమిటో చెప్పు బావా?

బా. అయితే మొదటకే తెచ్చావు మోసం! విసురు రాయికీ పెసర పప్పుకీ చుట్టరికం ఏమిటో చెప్పవే మరదలా!

మ. పప్పంటే తిరగలిలో పోలుకొని విసురుకుంటాం!

బా. అల్లాగే బావ ఉంటే అక్కతో కలిపి పెళ్ళి చేస్తాం!

మ. అయితే అక్కవంక బావ చుట్టమవుతాడన్నమాట?

బా. "పెసర పప్పువంక విసురురప్ప చుట్ట" మయినట్లే "అక్క వంక బావ చుట్ట" మవుతాడనుకో!

మ. బావా! నువ్వింత చిన్న వాడవుగదా! మా నాన్న గారు నీ కాళ్ళు కడిగి నీళ్ళు నెత్తిన చల్లుకున్నా రేమోయి!

బా. పెద్ద సందేహమే వచ్చిందే మరదలా? అయితే సాల గ్రామం పెద్దదా? సన్నికల్లు పెద్దదా? చెప్పు!

మ. అంత మాత్రం తెలియ దనుకున్నావా బావా? సాల గ్రామం చిన్న నేరేడు పండంత ఉంటుంది, అవునా?

బా. అయితే మీ నాన్నగారు పెద్ద సన్నికల్లుని కడగ క్కండా, చిన్న సాలిగ్రామాన్ని కడుగుతా రెందుకో! చెప్పు, మరదలా?

మ. చిన్నదే నా సాలగ్రామ మే! పెద్ద దేనా సాలగ్రామ మే! సాలగ్రామం యొక్క మూర్తి చిన్న దైనా; కీర్తి మాత్రం గొప్పదే! అందు కని! తెలిసిందా!

బా. అల్లుడు కూడా ఒక చిన్న మనిషే అయినా, మహిమ మాత్రం గొప్పదే! అందు కని, తెలిసిందా, మరదలా!

మ. నీ పెళ్ళి నాడు నీ చేతి కక్షింతలిస్తే, ఏం చేశావోయి?

బా. అది నువ్వు కూడా చూశావా, ఏమిటే?

మ. "పిల్లి కళ్లు మూసుకొని పాలు త్రాగుతూ ఎవ్వరూ చూడ్డం లేదను కొంటుందిట"! నిజమే నోయి!

బా. నువ్వు చూస్తే; నే నేమి చూశానో చెప్పు!

మ. చాటు కెళ్లి నోటిలో వేసుకొని బొక్కావు!

బా. కాదే, చిట్టి మరదలా! పిల్లి మొలకి రొయ్యల మొల తాడు కడితే ఏం చేస్తుందో చెప్పవే!

మ. ఏం చేస్తుంది? నీలాగే చాటుకెళ్ళి 'పటపటా' అంటుంది

బా. దాన్ని చూసే నేర్చుకున్నానే నేను మరదలా!

మ. అయితే నువ్వ పిల్లిబావ వన్నమాటా?

బా. కాదే పిల్లా! మరదల పిల్లి అన్నమాట!

మ. అయితే బావా! నీ పెళ్ళి నాడు మా నాన్నగారు కట్నమిస్తే పుచ్చుకుని చాలదని మళ్ళీ అలిగావెందుకోయి?

బా. అయితే నిన్న నువ్వ అన్నం తిన్నావు గదా! మళ్ళీ ఎందుకు తిన్నావే! మరి ఈ వేళ!

మ. నిన్న తిన్నన్నం అరిగిపోతే మళ్ళీ తిన్నాను!

బా. మీ నాన్నగారిచ్చిన కట్నం అయిపోతే అలకపాన్పు మీద అలిగి మళ్ళీ పుచ్చుకున్నాను!

మ. అయితే కడుపుకి ఎప్పటికీ నిండడమనేదే ఉండదు!

బా. అల్లుని ఆశకి కూడా ఎప్పటికీ నిండడం అనేదే ఉండదనుకో!

మ. అల్లుని వలె నిండడం అనేది లేని వారింకెవరేనా ఉన్నారా, బావా?

బా. నేనొక్కణ్ణే అనుకున్నావా ఏమిటే! ఇంకా ఉన్నారు నలుగురు. మా సోదరులు

మ. ఎవరా నలుగురూను. చెప్పదూ బావా!

బా. మేమందరం ఒక బడిలోనే 'జా' గుణింతం చదువుకునే వాళ్ళం, అందుకని మా కయిదుగురికీ "పంచ జకారాలు" అని పేరు పెట్టారు.

మ. 'పంచ జకారా' లేమిటోయి! పంచ వకారా లన్నట్లు! ఆ అయిదుగురూ ఎవరో చెప్పు?

బా. ముందు "పంచ జకారా" లంటే ఏమిటో చెప్పి, తరువాత ఎప్పుడేనా "పంచ వకారా" లను గూర్చి చెబుతానులే! విను:—
మొదటివాడు జాతవేదుడు

మ. అంటే ఎవరో బావా! ఏ వూరు ఆయంది!

బా. "జాతవేదుడు" అంటే అగ్నిహోత్రుడు. ఆయనకి కూడా ఎన్ని కట్టెల మోపులు పెట్టినా కాల్చేసి, ఇంకా తేతెమ్మంటాడు!

మ. నువ్వు మాత్రం ఏం తక్కువ! ఎన్ని చుట్టల కట్టలైనా, ఎన్ని సిగరెట్లు పెట్టెలైనా కాల్చేసి, ఇంకా తేతెమ్మంటావు!

బా. అగ్నిహోత్రుడు సర్వ భక్షకుడు కూడాను, తెలుసా!

మ. నువ్వు మాత్రం ఏం తక్కువ! ఎంత పెట్టినా! ఎప్పుడు పెట్టినా! ఏది పెట్టినా, భక్షించేసే సర్వభక్షకుడవేగా! మహానుభావుడవు!

బా. అతడు ధూమ ధ్వజుడు కూడానేవు!

మ. నువ్వొంటులో మాత్రం తీసి పోతావా ఏమిటి ! నువ్వె క్కడుంటే అక్కడే ఇంజను గొట్టంపొగలాగ, రావణా సురుని కాష్ఠంలాగా రాత్రిం పగళ్లు, పొగలూ సెగలూ నిగనిగ లాడుతూ పైకెగయ వలసిందే !

బా. ఇక్కడికి ఒకటి అయింది ! రెండవ 'జ కారం' జఠరం అంటే ఉదరం తెలుసునా ?

మ. రోజూ మనం ఉదరపూజ చేస్తూనే ఉంటాం కదూ ! దీనికి కూడా నిండడం అనేది లేకుండా నే ఉంటుందిలే, తెలుసు ! మూడవదో !

బా. 'జాయ' అంటే భార్య అన్న మాట ! ఆడవాళ్ళకి ఎన్ని వస్తువులు పెట్టినా. ఎన్ని చీరలు కొన్నా ! ఆశ తీరదు. వాళ్లకి ! నీ కనుభవమేగా అది !

మ. బావా ! నన్నంటే అన్నావు గాని, మా మహిళా సమాజాన్ని అన్నా వంటే మాత్రం నే నొప్పు కోనోయి ! ఏమైనాసరే !

బా. నేను యువతీ మండలీ నంతనీ అనడం లేదే చిట్టీ ! ఏ పాపం ఎరగని ఆడవాళ్ళని నే నెందు కంటానే ! వెర్రి దానా !

మ. మరి ఇప్పుడు నువ్వన్న దెవరిని ?

బా. భర్తలున్న స్త్రీలను మాత్రం అంటున్నాను గాని, అందరినీ ఎందుకంటానే ! పిచ్చిదానా !

మ. అల్లాగ సరైన మార్గానికి రా ! ఇంకా నాల్గో జకార మేమిటో చెప్పు !

బా. 'జలాశయం,' అంటే సముద్రం నాల్గవది. ఎన్ని సంవత్సరాల నుంచి, ఎన్ని నదుల ఉదకం ప్రవహించి కొంటూ వచ్చిపడినా, సముద్రానికి నిండడం అనేదే లేదు! చూస్తున్నావా!

మ. నీకు మాత్రం ఎన్ని కప్పుల టీ కాఫీలు, ఎన్ని సార్లు నీ ముఖద్వారం గుండా ప్రవహింప చేసినా గానీ, నీ ఉదర సముద్రానికి నిండడం అనేది లేదుగదా!

బా. నీ దిష్టి కళ్ళు పడి, నా కడుపెల్లా ఎండి, బెండై పోయిందో చూడు!

(కడుపు చూపి చేతితో వాయించును)

మ. చూశాను లే! నీ వీరణం! ఎంత బూరెల పూరణం పెట్టినా నీ జఠరానికి పూరణం అనేదే ఉండదు.

బా. పోనీ లేవే! పొట్టి మరదలా! అయిదో జకారం అంటే తెలుసా జామాత గారు!

మ. తమరి ప్రభావ మేలా ఉంది! పంచమ జకారం అంటేను! ఆగు బావా! (ఆలోచనను అభినయించును)

బా. ఏమిటే దీర్ఘాలోచన చేస్తున్నావూ!

మ. ఏమీ లేదోయి బావా; ఈ పంచ జకారార్థాలు వేరే వేరే చెప్పడం కంటే, నిన్నొక్కణ్ణే చెప్పేస్తే బాగుండే దేమో? చెప్పిందే మళ్ళీ చెప్పడ మనే పునరుక్తి దోషం ఎందుకు చెప్పాడు చెప్మా ఆకవి! అని ఆలోచిస్తున్నాను!

బా. వెళ్లి అడిగొస్తావా ఏమిటి ఆ కవిని? ఈ సభలో ఎక్కడైనా ఉండొచ్చేమో, చూచేనారా!

మ. ఆ కవిని చూడనక్కర లేదులే! ఆయన వ్రాసిన "తెలుగు సామెతలు" పుస్తకం చూస్తే తెలుస్తుంది. ఆ పద్యం నీకొస్తె చెపుదూ వ్రాసికొని ముఖపాఠం చేస్తాను.

బా. అమ్మా! నువ్వు ఎందుకు వ్రాసుకుంటా నంటున్నావో నాకు తెలుసు లే!

మ. ఎందుకో చెప్పు. తెలిస్తేను!

బా. ఈ పద్యం నలుగురికి చదివి వినిపించి నన్ను పరిహాసం చెద్దామని! తెలిసికో లేననుకున్నావా?

మ. నిన్ను పరాచకం చేస్తానా బావా! నీ కంటె పరాయి వా డెవరు నాకు చెప్పు బావా?

బా. (వ్రాసుకో, చెపుతాను. మరైతెను:-

ఆ. వె. 'జాతవేదసుండు, 'జామాత', 'జఠరమ్ము'
అనుగు 'జాయ'యును 'జలాశయమ్ము!'
మెండుగ నొసగినను-నుండు దండిగ నాశ!
తృప్తి, పూర్తి, పరిసమాప్తి, సున్న!

(మరదలు వ్రాసికొనుట నభినయించును)

మ. బావా! ఇంత చిన్న తనంలోనే నీ దంతాలూడి పోయాయేమోయి?

బా. అంతకుడూడ కొట్టాడే నా దంతాలు!

మ. ఎవరోయి ఆ హంతకుడు!

బా. యమ ధర్మరాజే! మరదలా!

మ. బాగా కొట్టేడా ? ఏం తప్పు చేశావని కొట్టాడు?

బా. ఎప్పుడో చిన్నప్పుడు మా క్లాసు పిల్లలిది పుస్తకాలు ఎత్తుకొచ్చి దొంగ బజారులో అమ్మి సినీమాల కెళ్ళా నటే! అదిట నా తప్పు!

మ. ఎందుకు చేశావో ఆలాంటి పాడుపని! దొంగబావా!

బా. ఏదో చిన్న తనంచేత చేశానే! ఆ తప్పులన్నీ నాదే అని తర్వాత తెలిసింది!

మ. ఇంకా ఉన్నాయా ఏమిటి 'తప్పులు' అని బహువచనం చెబుతున్నావు ?

బా. ఉన్నాయిలే! ఒకటి రెండు !

మ. అవికూడా చెప్పెయ్! "చేసిన పాపం చెపితే పోతుందిట"

బా. దేముడు నాకు నేత్రాలు, శ్రోత్రాలు, హస్తాలు మొదలైన అవయువాలిచ్చి నా గానీ, వానితో భగవంతుణ్ణి పూజింప కుండా. బడికి శలవు దొరికిందీ అంటే చదువు కోకుండా,సినిమాలకీ హోటళ్ళకీ పోతూ ఉండే వాణ్ణిలే చిన్నప్పుడు ! అది నాదే తప్పయింది.

(తెంపలేసు కొనును)

మ. తప్పుకి తగిన శిక్ష ఉండాలి కాదు మరీ! అందుకే పళ్ళూడ కొట్టాడేమో! ఇంకా నయమే! అంతటితో కుదర్చాడు అంతకుడు! అంత మొందించ కుండాను మా పొట్టి బావని! పోనీ ఇప్పుడేనా చేస్తున్నావా?

బా. ఉదయం పావుగంట రాత్రి పరుండబోయే టప్పుడు పావుగంట దైవ ప్రార్థన కోసం 'టైము రిజర్వు' చేశానే! మరదలా ?

మ. ఏ దేముణ్ణి ప్రార్థిస్తూ ఉంటావోయి. నువ్వు బావా !

బా. నాకు అందరు దేముళ్ళూ సమానమే; అయినా గాని నాకు ఇష్టమైంది లలితా దేవే !

మ. ఎవరు ? మా అక్కయ్యా ? నీకు దేముడు !

బా. కాదే! లలితా త్రిపుర సుందరీ దేవి! మరి నీకే దేము డిష్టమే ? మరదలా ?

మ. నాకు ఈశ్వరుడంటే ఇష్టమోయి బావా ?

బా. అవున్లె ! నిజమే ! స్త్రీలకి పురుష దేవతలే పూజింప తగ్గవారు !

మ. అయితే పురుషులు స్త్రీ దేవతలను పూజిస్తారని నీసంభాషణం వల్ల తెలుస్తూనే ఉందిగా ?

బా అయితే నా స్త్రీ దేవతా, నీ పురుష దేవతా, ఏమవు తారే మరదలా ?

మ. మా అక్కయ్య నువ్వూ ఏమౌతారో అది! తెలిసిందా? మరి నీ తల ఇంత చిన్నతనంలోనే నెరిసిందే మోయి !

బా. "బాల మెరుపో! భాగ్యం మెరుపో" అంటారు వినలేదుటే చిట్టి!

మ. నీ భాగ్యం ఎంతో నాకు తెలుసులే! ఏదో ఉంది రహస్యం చెబుదూ !

బా. ఎవరికీ చెప్పకేం మరి! విను దంతాలకీ కేశాలకీ ఒకప్పుడు కలహం ఒచ్చింది!

మ. ఎందుకోయి! ఆ రెండూ ఒకే శిరస్సున ఉంటూ, ఉండి కలహించు కోడానికి కారణ మేమిటి?

బా. ఒకచోట ఉంటే మాత్రం మన బడిపిల్లలు కొట్లాడు కోడం చూడడం లేదటే మనం, అల్లాగే వచ్చింది అంతఃకలహం! వారికీని!

మ. దేనికోసం ఒచ్చిందట మొదట!

బా. మేము తెల్లగా ఉన్నామంటే మేమే తెల్లగా ఉన్నామని!

మ. నల్లమసి బొగ్గులాగ ఉండే రోమాలకి ఇంత గర్వమా!

బా. తమ యోగ్యత ఎంతో తెలియకుండా ఎదటి వారి మీదికి సవారయ్యే వారు ఎంత మంది లేరు మనలోను? అందులో ఇదొకటి అనుకో!

మ. ఏమైంది. ఆ సమర సన్నాహం! ఆఖరికి!

బా. ఎవరు ఓడిపోతే వారు "నేలపాలు కావాలని" పందెం వేసుకున్నాయి అవి!

మ. అయితే ఎవరు గెలిచారు ఆ పందెంలోను?

బా. దురదృష్ట వశాత్తు, దంతాలు ఓడిపోయాయి! రోమాలు గెలిచాయి!

మ. పాపం దంతాలకి మాత్రం అన్యాయం జరిగింది! కాదుటోయి! బావా?

బా. ఆ అన్యాయాన్ని సహింప లేక తాము వేసికొన్న

పందెం ప్రకారం దంతాలు ఒక్కొక్కటే నేలపాలు అవడానికి మొదలు పెట్టాయి!

మ. మన న్యాయ స్థానాల్లో కూడా ఇల్లాగే న్యాయానికి అన్యాయం జరుగుతూ ఉంటుందేమో! కదూ?

బా. న్యాయాధికారి ధనాశ కలవాడైతే మాత్రం తప్ప కుండా అన్యాయం జరుగుతుందనుకో! మరదలా! అది లేకపోతే, పాలకు పాలు, నీళ్ళకు నీళ్ళూ వేరవుతాయి!

మ. "ఏ కట్టెన నిప్పంటే ఆ కట్టే కాలుతుంది" మనకెందు కులే! మనం మాత్రం అన్యాయం చేయకుండా న్యాయంగానే నడుచు కుందాం!

మ. అయితే బావా! అక్కయ్యని మా ఇంటికి పంపించేసి మళ్ళీ తీసుకెళ్ళనని కోపగించావుట కాదుటోయి? నిజమేనా?

బా. మీ నాన్నగారు సంక్రాంతి పండక్కి సారె చీర పెట్ట లేదేం మరి నాకు?

మ. సారె చీర పెట్టక పోతే మా అక్కయ్యని బయటికి వెళ్ళ కొడతావా ఏమిటి బావా? మా చిత్రంగానే ఉంది నీ వరస!

బా. అవును గాని సర్కారుకి పన్ను కట్టకపోతే ఏంచాస్తారే చిట్టి మరదలా?

మ. చెంబు తప్పేలా రంబుసూరయ్యకి వేలం వేసి అందరినీ బయటకి వెళ్ళకొట్టి ఇల్లు స్వాధీనం, చేసుంటారు! ఇంకేం చేస్తారు?

బా. నేను మాత్రం ఏం చేశాను? అంతేగదూ?

మ. సర్కారు పన్నూ, నీ సారె కట్నం సమానమా ఏమిటి?

బా. సమాన మెల్లా అవుతుంది. సర్కారు పన్నులికి డిక్రీలు, అమలు జరపడం మొదలైన తరంగం ఉంది? నా దాని కేముంది?

మ. అయితే మా నాన్నగారు నీకో మంచి ఉద్యోగ మిప్పిస్తే చేస్తావా! బావా?

బా. కడుపు నిండేలాగ దొరికితే సరి! ఏ ఉద్యోగమైనా సరే జేస్తాను?

మ. ఒక షరతుకి మాత్రం నువ్వు అంగీకరించాలి?

బా. ఏమిటా షరతు, చెప్పు వింటాను?

మ. కూడూ, గుడ్డా, అడక్కుండా ఉంటే కన్న బిడ్డవలె కని పెడతారు వారు!

బా. అయితే తప్పకుండా చేస్తాను! నా కల్లాంటి ఉద్యోగమే కావాలి కూడాను! కాని నాది కూడా ఒక షరతుంది మరి? విన్నావా?

మ. నీ షరతు కూడా చెప్పు వింటాను?

బా. పని పాటు చెప్పకుండా నన్ను పండుకో నిస్తే బంటు లాగ పగలు రాత్రి పని చేయడానికి సిద్ధమే నేను!

మ! ఎన్నడైనా మా నాన్నగారు కోపగించి నువ్వు మా అల్లుడవే కావు పొమ్మంటే ఏం చేస్తా వోయి బావా?

బా. నీ అల్లుణ్ణి కాక పోతే నా కష్టా-బు(రా, నాకు

పారేసి నా పెళ్లాన్ని నా వెంట పంపించ మంటాను! అంత కంటే నాకు వేరే గత్యంతరమేముందో చెప్పు?

మ. బావా! నువ్వు అసలే పొట్టి బావవు కదా! మా అక్కయ్య దగ్గర నువ్వు నిలబడితే ఎల్లా వుంటావో తెలుసునా నీకు?

బా. నాది నాకేం తెలుస్తుందే మరదలా? కొంచెం చెబుదూ తెలుసుకుంటాను!

మ. బలి చక్రవర్తి దగ్గర వామనావతారం లా ఉంటావు.

బా. వామనుడు బలి చక్రవర్తిని ఏంచేశాడే చిట్టి మరదలా?

మ. పాతాళ లోకానికి అణగ తొక్కాడు!

బా. అయితే దేముడికి ఎంతెంత నైవేద్యం పెడతారే మీ నాన్నగారూ?

మ. "కొండంత దేవునికి బెండంత నైవేద్యం" పెడతారు! నాకు తెలియదను కున్నావా? బావా!

బా. మరయితేను కుండంత గుమ్మడి కాయని ఎంతెంత సాధనాలతో కోస్తారో చెప్పు? మరదలా!

మ. "కుండంత గుమ్మడి కాయను బెండంతటి కత్తి పీటతో కట్టున తరుగు తారు!"

బా. అల్లాగే "కొండంత అక్కయ్యకి బెండంత బావయ్య!" అనుకో!

మ. అన్నింటికీ అన్నీ చెబుతావోయి నువ్వు బావా? "పొట్టి వాడికి పుట్టెడు బుద్ధులు"ట! నిజమే!

బా. నిజమే గాని నీ చేతిలోదేమిటే చిట్టి మరదలా?

మ. పండక్కి మా అమ్మ చేసింది లడ్డూ ఉండలు! పెట్టమన్నావా?

బా. "ధర్మానికి పెట్టిన తల్లీ! నీ మగనితో సమానంగా పెడితే పెట్టు!" లేక పోతె నీకే పాపం ఒస్తుంది, నాకేం!

మ. ఏం పాపం వస్తుంది చెప్పమ్మా?

బా. పంక్తి భేదంచేసిన పాపం నీకే తగులుతుంది, నా కేమిటే!

మ. ఏంచేస్తే పోతుందోయి బావా! ఆ పాపం?

బా. నీ మగనితో సమానంగా పెడితే పోతుంది!

మ. అమ్మా! పాపం! ఇద్దరికీ సమానంగా పెట్టాలిట! ఎవరు పెడతారమ్మా? అల్లాగ!

బా. పోసి! నువ్వు పెట్టకపోతే మీ అక్కయ్యే పెడుతుంది!

మ. మా అక్కయ్య మాత్రం ఎందుకు పెడుతుందీ! నీకూ! నే పెట్టొద్దని చెబుతాన్లె!

బా. నువ్వెందుకు పెడుతున్నావు మరి! మీ ఆయనకి?

మ. అమ్మా! ఎంతవాడో మా పొట్టిబావ! ఏమో అనుకున్నాను నేను?

బా. మా చిట్టి మరదలికి ఏమీ తెలియదనుకున్నాను. నేనూ! ఎంత పేగో ఇప్పటి నుంచీని!



శ్రీ ర స్తు

# "విఘ్నేశ్వరుని మీద భక్తి?"

(శ్రీరంగం, సురేశ్ అను స్నేహితుల సంభాషణము)

సు. శ్రీరంగం! ఏమిట్రా మట్టి ముద్దలు చేస్తున్నావు?

శ్రీ. వినాయక చవితి ఒస్తూంది కాదుట్రా!

సు. వినాయక చవితికి హనుమంతుణ్ణి పూజించే ఆచారముందా ఏమిటి మీ ఇంట్లోను?

శ్రీ. ఏమి! అల్లా అడుగు తున్నావు?

సు. ఆ వినాయక ప్రతిమను చూడు ఎల్లా ఉందోను!

శ్రీ. (బొమ్మను పరిశీలించి చూచి) అరే రే! పొరబాటున ముందుది తీసుకెళ్ళి వెనక్కి తగిలించాను రా!

సు. ఈలా పొరపాటు పడిన వాడవు నువ్వొకడవే కావులే!

శ్రీ. నాకు సాయమింకెవరేనా ఉన్నారా ఏమిటి!

సు. ఎవరూ లేకపోతే సామెత ఎట్లా వస్తుందిరా!

శ్రీ. ఏమిటా సామెత చెప్పు విందాం.

సు. "వినాయకుణ్ణి చెయ్యబోతే వానర మైందిట" అని.

శ్రీ. నువ్వు చెప్పకపోతే నేను చూచుకోక నే పోదునేమో!

సు. ఈ చెవులేమిటి జానెడేసి ఉన్నాయి?

శ్రీ. అది ప్రమాణాన్ని పట్టే పెట్టానులే.

సు. ఏమిటా ప్రమాణం చెప్పు, విందాం!

శ్రీ. "అగ-జాననపద్మార్కం" అంటే గణపతికి జానెడేసి చెవ్వులుండాలని భావం తెలుసా?

సు. తొండ మేమిటి గజం పొడవు సుమారుంది?

శ్రీ. అదీ సప్రమాణంగా కొలిచే పెట్టాను లే! గజం పొడవు ఉండాలని.

సు. ఏమిటా ప్రమాణం! వినిపించు.

శ్రీ. "గజా నన మహార్నిశం" అంటే గణపతి తొండం గజం పొడవుండాలని సారాంశం.

సు. దంతా లేమిటి అన్ని పెట్టావు?

శ్రీ. "అనేక దంతం" అని కదా ధ్యాన శ్లోకంలో ఉంట. అందుకని మూడు పెట్టాను.

సు. చిన్న దంతం కనిపిస్తూం దేమిటి ఒకటి?

శ్రీ. 'మేకదంత ముపాస్మహే' అని కదుట్రా! 'మేకదంతం' అంత కంటె పెద్దది ఎల్లా దొరుకుతుందో చెప్పు?

సు. ఈ అర్థం నీ కెవరేనా చెప్పారా? నీకే తోచిందా?

శ్రీ. గణపతి ప్రార్థనకి కూడా అర్థం తెలియదుట్రా? దీని కొకరు చెప్పాలా కూడాను?

సు. అయితే శ్రీరంగం! వినాయకుడి మీద నీ కింత భక్తి కుదరడానికి కారణ మేమిట్రా?

శ్రీ. "ఆదౌ పూజ్యో గణాధిపః" అంటే అన్ని కార్యాలకీ ముందుగా గణపతిని పూజిస్తే విఘ్నాలు నశిస్తాయిట కదుటా?

సు. అది అందరికీ తెలుసులే! కాని వాళ్లందరికీ ఇంత భక్తి కుదిరిందంటావా?

శ్రీ. నువ్వు నా ప్రాణ స్నేహితుడవు కనుక రహస్యం దాచకుండా చెప్పేస్తున్నాను. ఎవ్వరితోను చెప్పకేం మరి?

సు. నే నెవరితో చెబుతాను రా? ఎన్నడేనా చెపితే ఇద్దరితోటి మాత్రం చెబుతా ననుకో!

శ్రీ. ఇద్దరితోటి చెపితే పరవా లేదులే! ఎవరా ఇద్దరూను?

సు. అడిగిన వాళ్ళొకరు, అడగని వాళ్ళొకరు

శ్రీ. ఇంత మందిలో ఇద్దరికి చెపితేనేమిలే. విను:- "ఇదంతా వినాయకుని మీద భక్తే అనుకోకు"

సు. వినాయకుణ్ణి పూజిస్తూ వినాయకుని మీద భక్తికాదంటే ఎట్లాగరా?

శ్రీ. వినాయకుణ్ణి పూజిస్తేనే గాని మనకు లభిస్తాయా చెప్పు? ఉండ్రాళ్ళూ, లడ్డూలూను?

సు. అయితే వినాయకుని మీద భక్తా? ఉండ్రాళ్లు మీద భక్తా నీకు?

శ్రీ. నువ్వేదేనా అనుకో సురేశా! ఉన్న రహస్యం నీతో చెప్పేశాను గదా!

సు. నీకు తగిందే నీ బుద్ధి! నీబుద్ధికి తగిందే నీ భక్తి! బాగా కూర్చాడ్రా పాడుదేవుడు! మంచిది వెళ్ళొస్తాను.



ఓం

# పద్దమ్మ గారి పట్టు చీర!

*(పక్కింటి పద్దమ్మ-పొరిగింటి పోలమ్మ గారి వెనక పీట పట్టుకొని తిరుగుతూ ఉంటుంది)*

*(పోలమ్మ ఇట్లను కొనును)*

పో. (తనలో) పెళ్ళి వారందరూ ఇంక లేచేస్తారులాఉంది! కాఫీ గిన్నెలు తోముకుని కాఫీవేనా పెడతాను!

*(గిన్నెలు, చెంబులు కట్టుకొన్న పట్టు చీరతో తుడుచు చుండును.)*

పాలు పొంగి పోతూందేమో చూసేనా వస్తానుండు!

*(లేచివెళ్ల చుండగ పద్దమ్మ కూడా పీట పట్టుకుని వెంటవెళ్ళును, ఆమె పాలుతెచ్చి కూర్చొను చుండగా, పద్దమ్మ క్రింద పీటవేసి ప్రక్కన నిలుచుండును.)*

పో. అయ్యో! నా మతిమండ! చక్కెర తేవడం మరిచే పోయానమ్మా! ఇంతచేసీ!

*(మళ్ళీ లేచి వెళ్ళును. పద్దమ్మ కూడా వెంటవెళ్ళును. ఆమెరాగానే పద్దమ్మ కూడా పీట పట్టుకుని వచ్చి మరల పీట వేయుచుండును.)*

పో. నీళ్లు కాగేదాకా విభూతి యోగంలోది రెండు గోవింద నామాలేనా పాడుకుంటాను! చెయ్యిపని చేస్తూంటే నోటికేమి?

*(గోవింద నామాలు)*

1. గ్రామాలలోకెల్ల-ఘనమైన యట్టి
సాల గ్రామము నేను-సుమ్మి కిరీటీ!

2. వాసాలలోకెల్ల-వాసికెక్కిన యట్టి
రాణి వాసము నేను-సుమ్మా కిరీటీ!

3. కట్టాలలోకెల్ల-కమ్మాని దైన
జీలకఱ్ఱను నేను-సుమ్మా కిరీటీ!

4. విల్లాలలోకెల్ల-నల్లాని గొల్ల
పిల్లవాడను నేను-సుమ్మా కిరీటీ!

*  *  *  *  *

నీళ్లు కాగినట్లుంది, ఒడపోస్తాను ఇంక!
(పట్టుచీర కొంగులో నీళ్లగాని పోలుగావి ఒడపోయుచూ)
'ఎరువువస్తువు బరువుకిచేటు! తీసిపెట్టుకుంటే తీపికిచేటుట'
ఎరువు చీర మరకలు చెయ్యా కూడదమ్మా!

(ఇంతలో పూజారి పుల్లమ్మవచ్చి పద్దమ్మతో ఇట్లు ప్రశ్నించును)

పు. ఏమో! పద్దమ్మక్కా! పొరిగింటి పోలమ్మతో నీకేం పని పడిందో?

ప. పనిలేదూ పాటలేదో పుల్లక్కా! వాళ్ళింట పెళ్లికదూ!

పు. పెళ్ళిపనులకి సాయం జేస్తున్నావల్లే ఉంది, పరోపకార మంటే నిన్నే చెప్పాలో పద్దక్కా!

ప. పరోపకారంలేదూ చట్టు బండలూలేదో పుల్లక్కా!

పు. ఏమిటో చెప్పరాదుటో! ఆ చిదంబర రహస్యం?

ప. రహస్యం బట్టబయలు! ఏమీలేదో పుల్లక్కా! పెళ్ళి నాలుగు రోజులకీ ఓసారి ఎరువిమ్మంటే ఇచ్చానో నా పట్టుచీర!

పు. అయితే నాకు తెలియకడుతా, ఆమె ఏమైనా తినే స్తుందా ఏమిటో! ఆ నాలుగు రోజులు అయిపోయాక తెచ్చి ఇచ్చేస్తుందిలేవో! ఈ డొంక తిరుగుడెందుకో!

ప. కాదో పుల్లక్కా! ఎరుపు చీర అని ఎరగక బురదలో కూర్చొని చీరనిండా మరకలు మరకలుచేసి పారేస్తే, నేల మీద కూర్చున్న పోలమ్మకు నష్టమా! పట్టుచీర ఎరువిచ్చిన పద్దమ్మకు నష్టమా? చెప్పు పుల్లక్కా!

పు. 'పట్టుచీర ఎరువిచ్చి పీటపట్టుకుని వెనకాల తిరిగిందింట' నిజమేనో! పద్దక్కా.

పు. ఆ మాట ఎంతో అనుభవ సిద్ధమే నమ్మా!

పు. మొన్న మావాడు కూడా ఇల్లాగే చేశాడులే!

ప. ఏం చేశాడమ్మా చెప్పు!

పు. రాత్రి తెల్లవార్లూ కంటిమీద కునుకు లేదుగదా! భళ్ళున తెల్లారిందనుకో పద్దక్కా!

ప. ఏఁ! ఎవరికేనా జబ్బుచేసిందా ఏమిటమ్మా! పుల్లక్కా!

పు. జబ్బూ లేదూ! చావు లేదు! కుక్కల భాగోతం చూస్తూ జాగరం చేశామమ్మా! మాఇంటిల్లు పాదీని!

ప. ఇదేం చిత్రవమ్మా! కుక్క లెక్కడేనా భాగోత మాడతాయటమ్మా! కోతులాడయిగాని? 'చెప్పేవాళ్ళు చెమిటి వాళ్లయితే వినేవాళ్లకేనా వివేకం ఉండొద్దూ'

పు. భగోతంకాదో పుల్లక్కా! మా వంటింట్లోకి కుక్కలు రాకుండా కాపలాకాస్తూ జాగరం చేశావంటున్నానో!

ప. తలుపు లేసుకుంటే కుక్కలేలా వస్తాయమ్మా?

పు. తలుపులు లేకనే కాదుటమ్మా ఈ భాగోత మంతాను?

ప. మీా ఇంటికి తలుపులుండాలి కాదుటమ్మా! పుల్లక్కా!

పు. లేదని ఎవరన్నారమ్మా! అవే మావాడు తీసుకెళ్ళాడు!

ప. ఎక్కడేనా అమ్ముకో లేదుగదా! ఈ కాలం పిల్లలు న్నారే ఒట్టి కోతిపిల్లలే అనుక్కో పుల్లక్కా!

పు. మావాడల్లాంటి వాడు కాదమ్మాయి! మా మంచి వాడు పరోపకారమంటే చెవికోసుకుంటా డనునో!

ప. మరి ఏంచేశాడు ఆ తలుపులు?

పు. పొరుగు వారింటికి తలుపులు లేక బాధ పడుతూంటే, చూడలేక మా ఇంటి తలుపులు తీసుకెళ్ళి వాళ్ళ గుమ్మాని కెత్తాడ టమ్మా!

ప. ఇదేమి శోద్ధమమ్మా "తనకుమాలిన ధర్మమూ, మొదలు చెడ్డచేరమూ ఉంటుందిటమ్మా!"

పు. ఆ. వె. కట్టగ నెరువిచ్చి పట్టు చీర నొకర్తె
పీటఁ బట్టుకొనుచు వెంట దిరిగె!

ప. తన తలుపుల తీసి తనవారి కెరు విచ్చి!
కుక్కల నిశి గాచు కొనె నొకండు!

సమాప్తము



# "కైలాసంలో పరిహాసం"

(రాము, సోము సంభాషణ)

రా. సోమేశం! ఏమిట్రా వ్రాస్తున్నావ్రా?

సో. శ్లోకం వ్రాస్తున్నాను రా!

రా. ఏమి శ్లోకం రా అది? నీ శోకం లాగే ఉంది!

సో. ఏదో శ్లోకం రా, నిన్న రాత్రి స్వప్నంలో విన్నాను!

రా ఏది! ఏమేనా జ్ఞాపక ముందా?

సో. నాలుగో పాదం మాత్రం జ్ఞాపక ముందిరా! "తత్ప్రణమామి సదాశివ లింగం" అని

రా. స్వప్నాలు నిజమవుతాయా ఏమిట్రా?

సో. స్వప్నాలకి ప్రత్యేకంగా శాస్త్రమే ఉంటే స్వప్నాలు నిజం కాక పోవడమేమిట్రా! రామూ?

రా. స్వప్నాలూ, శకునాలూ, ఈ రోజుల్లో ఎవరు నమ్ముతారు లేద్దూ?

సో. ఈ రోజుల్లో దేవుణ్ణీ నమ్మడం లేదూ కొందరూ! అయితే దేవుడే లేడంటావా ఏమిటీ?

రా. దేముడు లేడనడం దాకా రాలేదు లే నా విజ్ఞానం!

సో. రామాయణంలోని త్రిజటా స్వప్నం నిజమే అంటావా?

రా త్రిజట అంటే ఎవరు రా? నేవిననే లేదు!

సో. అశోక వనంలో సీత దగ్గర కాపలా ఉన్న ఒక రాక్షస స్త్రీ! ఎరగవ్రుట్రా?

సో. దాని కేమని స్వప్న మొచ్చిందీ? చెప్పు!
సో. శ్రీరాముడు, సీతవెల్ల ఏనుగు మీద కూర్చుని ఆకాశం మీద ప్రయాణం చేస్తూన్నట్లు వచ్చిందిట్రా!
రా. ఆఖరుకి అదేనిజ మయింది! వారికే విజయం చేకూరిందన్న మాట కూడాను! కలలు నిజమేరోయి!
సో. అయితే త్రిజటా స్వప్నం నిజమే అంటావా! కాదా!
రా. అయ్యో! రామాయణం నమ్మక పోతే ఎల్లాగరా? హిందూమతాని కంతకీ అదే మూలాధారం కదుట్రా?
సో. అయితే నా స్వప్నం మాత్రం నిజం కాదని ఎల్లా చెబుతావురా నువ్వు?
రా. అసలు నీ స్వప్నం ఏమిటో చెప్పు విందాం!
సో. విను:- నేను ఒక పక్షివలె ఎగురుకుంటూ కైలాసం లోకి వెళ్ళి పోయానుట్రా!
రా. అయితే కైలాసంలో విశేషా లేమిటి?
సో. మహర్షులు, ప్రమథగణాలు నిండు సభలో కూర్చున్నారుట్రా! వాళ్ల పక్కనే నేనూ కూర్చున్నానుట
రా. పార్వతి కూడా ఉందా శివుని పక్కనా?
సో. శివుని వామభాగంలో పార్వతి కూడా కూర్చునే ఉంది!
రా. ఈశ్వరుని వేషం ఎల్లా ఉందిరా?
సో. శివుని కంఠంలో రుద్రాక్షలు, ముఖాన విభూతి, శిరస్సున నాగాభరణం కటి ప్రదేశాన కౌపీనం ధరించి ఉన్నాడు రా?

రా. ఏం ఉపన్యసించాడురా? ఆ సభలోను మహేశ్వరుడు ?

సో. రామతారక మంత్రం యొక్క మహిమను వర్ణించి చెప్పాడురా ఈశ్వరుడు!

రా. శంకరునికి శ్రీరామ చంద్రుడే ఇష్ట దైవమట లే! అందుకని రామ మంత్రం యొక్క మహిమను చెప్పి ఉంటాడు ఈశ్వరుడు. తరువాత?

సో. భృంగీశ్వరుడులా ఉందిరా ఏదో ఒక సందేశాన్ని తెచ్చి మహేశ్వరుడికి అంద చేశాడు!

రా. ఎవరు పంపారుట ఆ సందేశం ?

సో. విష్ణుమూర్తి పంపాడట!

రా. ఏమని కబురు పంపించాడట ?

సో. ఒక్క సారి దర్శనం ఇప్పించ వలసిందని.

లా. ఏమన్నాడు మహేశ్వరుడు ?

సో. విష్ణుమూర్తిని సగౌరవంగా తీసుకురమ్మని భృంగీశ్వరుణ్ణి పంపాడు ఈశ్వరుడు

రా. ఈశ్వరుడు తన ఇష్టదైవానికి స్వాగత మివ్వలేదుట్రా?

సో. ఇద్దామని లేచాడు, కాని కౌపీనంతో ఇష్టదైవానికి స్వాగత మివ్వడం మర్యాద కాదని, గజ చర్మం మొలకి చుట్ట పెట్టుకుని, అది జారి పోకుండా నాగు బాముతో దాన్ని గట్టిగా బిగించి కట్టాడు రా!

రా. తరువాత ఏమైంది రా!

సో. ఇంతలో విష్ణుమూర్తి గరుడ వాహనంతో లోపలికి ఒచ్చి ఈశ్వరునికి నమస్కరించాడు రా?

రా. ఈశ్వరుడేమన్నాడు విష్ణువుతో?
సో. యోగక్షేమం చేసి పీఠం మీద కూర్చోబెట్టాడు రా!
రా. విష్ణుమూర్తి ఏమన్నాడు ?
సో. శివుణ్ణి ధ్యానిస్తూ ఏదో శ్లోకం చదివాడు రా! దాని చివర పాదం జ్ఞాపకమొచ్చింది. అదే రాస్తున్నాను?
రా. ఏమిటది చెప్పు వింటాను.
సో. ఆఁ! జాపక మొచ్చింది రా! ఉండు! మాట్లాడించకు! వ్రాసుకుంటాను

శ్లో. బ్రహ్మ మురారి సురార్చిత లింగం
నిర్మల భాసిత–శోభిత లింగం!
జన్మజ దుఃఖ వి–నాశక లింగం
తత్ప్రణమామి స–దాశివ లింగం!

రా. నాలుగు లింగా లేమిట్రా? మూడే కాదూ లింగాలూ
సో. అత్తయ లింగం, పిల్లెయ లింగం, పాలయ లింగం? తాగేయ లింగం! నాలుగు లింగాలు! నువ్వు చెప్పిన లింగాలివేనా?
రా. ఇవి కావోయి! మన తెలుగు 'మాస్టారు' చెప్పిన లింగాలు నేను చెప్పినవి!
సో. అవి మాత్రం ఎన్ని? నాలుగే కాదూ?
రా. నాలుగు కాదోయి! మూడు!
సో. ఆ మూడూ ఏమిటో చెప్పు?
రా. పుంలింగం, స్త్రీ లింగం, నపుంసక లింగం.
సో. నాలుగో దేదీ మరీ?
రా. నాలుగో లింగం మాకు చెప్పనే లేదు రా?

సో. నాలుగో లింగమే ఉభయ లింగం. తెలిసిందా నీకు?
రా. ఉభయ లింగం అంటే ఏమిట్రా?
సో. ఒక స్త్రీ "నేను శివుని పూజించు చున్నాను" అని అందను కో! అప్పుడు 'నేను' అన్న పదం ఏం లింగం అవు తుందంటావు?
రా. స్త్రీ మాట్లాడింది కనుక స్త్రీ లింగం!
సో. అదే వాక్యం పురుషు డంటే, ఏ లింగం అవుతుంది?
రా. పురుషుడు మాట్లాడాడు కనుక పుంలింగం అవుతుంది. అదీ తెలియ దనుకున్నావా? సోమూ!
సో. అయితే నేను అన్నది ఇప్పు డేమయినట్లు? నాలుగోది ఉందంటావా?
రా. ఇద్దరికీ కలిసింది కనుక దాన్ని "కామన్ జండరు" అనొచ్చు లే! నిజమే!
సో. దాన్నే మన తెలుగు మాస్టారు "ఉభయ లింగం" అన్నారు. తెలిసిందా ఇప్పుడు?
రా. తెలిసింది లే! ఏమిటో అనుకున్నాను! 'ఉభయ లింగం' అంటేను! తరువాత?
సో. గరుత్మంతుడు కూడా తన ప్రభువు గారి దగ్గరకొచ్చి నిలుచున్నాడు రా!
రా. ఎవరి భక్తులు వారి ఇష్ట దైవాల వద్ద ఉండడం యుక్తమే కదా?
సో. యుక్త మే లే! విష్ణుమూర్తి నిలుచుండి ఈశ్వరుణ్ణి ధ్యానిస్తున్నాడు
రా. అవును లే! మన జాతీయ ధ్వజానికి వందనం చేస్తూ

మనమూ నిలబడతాం కదూ! అల్లాగే నిలుచున్నాడేమో శివుడు కూడాను!

సో. విష్ణువు నిలబడ్డాడని శివుడు కూడా నిలబడ్డాడు.

రా. తన ఇష్ట దైవం నించుని ఉంటే తాను కూర్చోడం బాగుంటుందా మరి!

సో. అందుకే మన ఉపాధ్యాయులు వస్తే మనం కూడా నిలబడతాం కదూ!

రా. అయితే తరువాత?

సో. విష్ణువు పై శ్లోకంతో ధ్యానం చేస్తూనే ఉన్నాడు. ఇంతలో సభలో గొల్లున గోల బయలు దేరింది!

రా. ఏం ప్రమాదం జరిగిందీ అక్కడ!

సో. ఏమో మొదట నాకూ తెలియ లేదు! కొందరు పక పకా నవ్వుతున్నారు ఎందుకో గాని!

రా. కారణం ఏమిటో తెలియ లేదురా?

సో. గరుత్మంతుణ్ణి చూచి శివుని మొలకు కట్టిన కాల సర్పం కంగారు పడి సభలోకి బుస్సుమంటూ పరిగెత్తింది!

రా. గజ చర్మం ఉందా! మరి?

సో. కట్టిన పామే పారిపోతే గజ చర్మం ఎల్లా నిలుస్తుందిరా? ఆ గోలతో తెలి వొచ్చేసింది రా! మామూలుగా పక్క మీాద చూస్తే ఏమీా లేదు. నల్లులు దోమలూనూ?

రా. ఆ శ్లోక మేనా ఏమిటి వ్రాస్తున్నావు? మంచి స్వప్నమే రా! ప్రత్యక్షంగా శివ దర్శనం చేశావు. నీ అదృష్టం మహా మంచిది రా!



# "లోభివాని విందు"

(రామభద్రం, చంద్రశేఖరం అనే స్నేహితుల సంభాషణ.)

చం. ఏమిరా వీరభద్రం! ఎక్కడ నుంచీ?

రా. నా పేరు నీకు తెలయదుట్రా? అల్లా పిలుస్తున్నావూ?

చం. మారు పేరు పెట్టుకున్నావా ఏమిటి, నువ్వు?

రా. తాత్కాలికంగా పేరు తారుమారు చేసానులే!

చం. ఎందుకు చెయ్యవలశొచ్చిందీ, ఆ పాడుపనీ?

రా. నిన్న పండితారాధ్యులవారింట సమారాధనం జరిగిందిరా!

చం. వాళ్లు లింగధారులు కదూ!

రా. అందుకే ఈ నామ పరివర్తనం!

చం. ఏమని పరివర్తనం చేశావు నీ నామాన్ని?

రా. 'రామ' భద్రుడికి బదులుగా వీరభద్రుడు అని మార్పు చేశాను!

చం. ముఖాలంకార మేం చేశావు!

రా. ఊర్ధ్వపుండ్రం తీసేసి విభూతి, రుద్రాక్షలు ధరించి అపర శివావతారం లాగ తయారయా ననుకో!

చం. నువ్వు వేశిన పాచిక పారినట్లే!

రా. పాచిక పారింది కనుకనే వడలు, భక్ష్యాలు, చిట్టి గారెలు లభించాయనుకో!

చం. నేడు కోవెలలో శఠకోపాచార్యుల వారిది తిరువారాధనం ఉందిట కదూ ?

రా. అందులో అగ్రస్థానం నాదే అనుకో !

చం. అప్పుడీ పేరు తోనే ఉంటే వాళ్ళా అనుమానిస్తారేమో నిన్ను ?

రా. ఇంకా ఉందా ఆ పేరు ? అక్కడే దులిపేశానురా మిత్రమా ?

చం. ఇంతకీ ఇప్పుడు నీ పేరేమి టంటావు ?

రా. సమయానుకూలంగా పేర్లు మార్చబడును ! అనుకో !

చం. 'దున్నపోతే దూడల్లోకి, మెయ్యబోతే పెయ్యలలోకి" అంటారు నిజమే !

(ఇంతలో ఒక భట్రాజు పాట పాడుతూ ప్రవేశించును)

పాట:- ఆశ లేల ! వేష మేల ! మోస మేలరా జీవ !
మోసగింపఁ బోయి నీవె – మోసపోకురా !
పరుల మోసగింప పోయి నీవె !

రా. వీడెవడో నన్నే ఆక్షేపిస్తున్నాడురా !

చం. "గుమ్మడికాయ దొంగ అంటే నువ్వు బుజాలు తడుముకుంటావెందుకురా?" వాడేదో ముష్టిపాట పాడుకుంటూ ఉంటేను !

భ. బాబయ్యా ! మీరు ఇంద్రులు ! చంద్రులు ! ఉపేంద్రులు ! మహేంద్రులు ! చలితో బాధ పడుతున్నాను బాబయ్యా ! ఒక్క పాతదుప్పటీ దానం చేయిస్తే తమ పేరు ఊరూరా చెప్పుకుంటానండి ! ధర్మ ప్రభువులు బాబయ్యా ! తమరు !

ఇల్లాంటి వాళ్ళకి ఏదిచ్చినా, అన్ని చోట్ల మన పేరు ప్రతిష్ఠలు చెప్పుకుంటారు. ఏదేనా ఉంటే ఒక పాత దుప్పటీ పారెయ్యాలోయి, పాపం! భట్రాజుక్!

భ. (తనలో) బాబయ్యగారు డొక్కా సుబ్బారాయుడు గారు వంటి ధర్మ ప్రభువులు! ఆ మహాతల్లి డొక్కా సీతమ్మగారి పేరు ఎన్నటికేనా మరుస్తామా బాబయ్యా? అర్థివాణ్ణి బాబయ్యా! 'దేహీ' అంటే 'నాస్తి' అన బోకండి బాబు!

(తనలో) నా లోభత్వం వీడికి తెలియ నివ్వడం ఎందుకూ? ఏదో "మసి పూసి మారేడుకాయ చెయ్యాలి" (ప్రకాశంగా) ఓ భట్టుమూర్తీ! నీవు మధ్యాహ్నం భోజన మెక్కడ?

భ. ఊళ్ళో ఎవరేనా అన్నదాత లుంటారేమో ఊరు తిరిగి ఒస్తానండి! తమరు దుప్పటీ ఇప్పిస్తే తమ పేరు ఊరూరా చెప్పుకుంటానండి బాబూ!

చం. భోజనానికక్కడా నువ్విక్కడికే రా! ఇదిగో దుప్పటీ! నీ సంచీ జోలె మా లోపలే పెట్టుకో! ఏం భయం లేదులే!

భ. చిత్తం ధర్మ ప్రభువులు! అన్న దాతలు! తమ వంటి వారిని ఎన్నటికేనా మరుస్తానా అండి!

*(సంచి, జోలె లోపల పెట్టుకుని, దుప్పటి భుజముపైన వేసుకొని, పాట పాడుచూ వెళ్ళును.)*

సీ. "కాశీ విశ్వేశు డీ—ఘన చంద్ర శేఖరుం
డాతని భార్యయే—అనపూర్ణ!"

(మరల మరల అదే పాట పాడుచు పోవును)

రా. ఊరంతా సాటించేస్తాడ్రా! ఇంక! నీ పేరు మారు మోగి పోతుందనుకో!

చం. పత్రికలు లేని రోజుల్లో ప్రచార కార్యం వీళ్ళ తోనే జరిగేదేమో రా!

రా. అనుకూల ప్రచారం కంటె, ప్రతికూల ప్రచారమే వీళ్ళ నుంచి ఎక్కువ జరుగుతుంది! తెలుసా?

చం. అందుకే కవులనూ, గాయకులనూ, భట్రాజులనూ, తోలు బొమ్మల వాళ్ళనీ ఏమైనా అన్నామంటే దేశమంతటా "టాం టాం" చేసేస్తారు. గండోళిగాడు బొమ్మ నేసాడంటే వాడు బంగారక్కతో చెప్పి మన్ని ఏం చేసినా చేస్తాడు రా!

రా. ఇంక నేను సమారాధనకి పోతానోయి!

(వెళ్లిపోవును)

(ఇంతలో భట్రాజు పాడుతూ ప్రవేశించును)

చం. ఏమోయి! భట్టుమూర్తి! ఊరు తిరిగొచ్చావా!

భ. ఏం పాడూరు బాబయ్య! "పిల్లికేనా బిచ్చం పెట్టరు" బాబూ! ఎవ్వరూను! "గంజాయి వనంలో తులసి మొక్కలాగ" పుట్టారు బాబు! తమ రొక్క రూను!

చం. ఏదీ నీ కిచ్చిన పాత దుప్పటీ! చిరిగి పోయిందేమో చూస్తాను?

(తీసికొనును)

భ. బాబయ్యా! ఇగుగో నండి! బుజం మీద వేసుకుని ఊరందరికీ ఇంటింటా చూపించొచ్చానండి బాబయ్యా!

చం. *(దానిని తీసుకొని లోపల దాచుటకు వెళ్లును)*

భ. (తనలో) బాబయ్యా గారు పాత దుప్పటీ తీసికొని కొత్తదిస్తా రల్లేఉంది! నా అదృష్టం మంచిది! "కాశి విశ్వేశుడీ"

చం. *(ఇంతలో "కుష్ఠు ప్రియాలు ఖాన్యా హస్తాల"తో వచ్చి)* ఓ భట్టు మూర్తీ! నీ మూట ముల్లె ఎక్కడుంది? చూసుకున్నావా?

భ. పడేశిన చోటే ఉందండి బాబు! నా గొంగడీ గుడ్డ; గోనె సంచీని!

చం. నీ సామాను నువ్వు తీసుకొని ఒచ్చిన దారినే వెళ్లిపో వచ్చు ఇంక!

భ. ఏం బాబయ్యా! కొత్తది లేకుంటే లేకపోయె! నా పాతదేనా నాకు పారెయ్యండి బాబయ్యా!

*(చేయి చాపును)*

చం. "అప్పటి కని దుప్పటీ ఇచ్చాను గాని, ఎప్పటికీ కప్పుకోడానికిచ్చానా!" భట్రాజూ?

భ. దుప్పటీ లేకపోతే మానె, ధప్పళ మేనా పెట్టించండి బాబయ్యా!

చం. ఇప్పటికి దుప్పటీ లేదు, అప్పటికి పప్పు ధప్పళం లేదు! తప్పుడు కూతలు కూయక చప్పున పో! మరెప్పుడేనా వచ్చా వంటే నీ సంచి జోలె కూడా నీకు దక్కదు!

భ. పోనీ బాబు! ఈ జోలె మీరే తగిలించుకోండి!

(జోలె ఇవ్వ బోవును)

చం. మాటలు తిన్నగా రానీ! గవ్వ పిల్లల్లాగ ఊడి పడుతాయి 32 పళ్ళూను! ఎరుగుదువా?

భ. ఇంతకు ముందు తెలియదు బాబు! ఇప్పుడు తెలిసింది లెండి! "లోభివాని విందు కుడిచే దాకా నమ్మకం లేదం"టారు బాబు! నిజమే! తెలిసింది లేండి, మీపేరు ఊరూరా చెప్పు కుంటా లేండి!

సీ:- చంద్రశేఖరుండు–జగతిని 'పిసినారి'
ఆతని భార్య "గ–య్యాళి గంప"
పిసినిగొట్టులు పెట్టు–విందును తినుదాక
నమ్మబోకుడు కాళి–కమ్మ తోడు!

పాట. కాయ ముండబోదు మాయ – చేయబోకురా జీవ!
మాయ విడచి భక్తినాంజ – నేయు దలపరా?



# "కర్ణం గారి - కవిలె కట్ట"

*(కర్ణంగారు వీధి సావడిలో కూర్చుని దస్త్రములు విప్పి పరిశీలించు చుండును. నలువైపుల కాగితములు, కలములు, సిరాబుడ్లు, రూళ్ళ కఱ్ఱలు, పడియుండును)*

క. (తనలో) ఎక్కడ పెట్టానో ఏమిటో కనిపించదూ! అది దొరికితేనే గాని ఎల్లాగ ఈ కార్యం జరగడం? 'పినాల్టీ' కట్టవలసిన వారి పేర్లన్నీ ఒక చోట వ్రాసి ఉంచాను. ఈ మహా సముద్రంలో ఎక్కడ మునిగి తేలుయిందో అది ? తెలియదు!

*(ఇంతలో వెంకన్న అను ఒక రైతు ప్రవేశించును.)*

రై. ఏమండి బాబూ! కన్నంగారూ! పాత కవిలె కట్టలు తిరగేస్తున్నారేటండి బాబూ?

క. అమ్మాయి గారికి పెళ్ళి స్థిరపడింది కాదుటోయి! వెంకన్న కాపూ?

రై. పెళ్ళి పత్రికలు దస్త్రంలో పెట్టి కట్టారా బాబూ?

క. కాదోయి! వెంకన్న కాపూ! ఏ రైతులు గవర్న మెంటు భూములు ఆక్రమించు కున్నారో, ఏ ధన వంతులు వీధి అరుగులూ, వీధి పంచలూ ముందుకు పెంచారో, ఆలాటి వాళ్ళని చూచి రేపు పర్గం చూపించాలి! అదే వెతుకుతున్నాను!

రై. దానివోల్ల మనకేం కలిశొత్తాదుండి బాబయ్యా?

క. మనకి అందులోనే కలిశిరావాలి? లేక పోతే మన చేతులో ఏముందో చెప్పు పెళ్ళికి?

రై. మొన్న దసరా పండగ క్కేదో మామూళ్ళిచ్చారు కాదుండి బాబయ్యా?

క. దసరా, అయితే దీపావళి రాదుటోయి? మళ్ళీ దీపావళి కాగానే పిల్ల పెళ్ళైనాయె!

రై. ఇది న్యాయమా బాబూ? మా వొంటోళ్ళు చీటికి మాటికి చందా లెట్టివ్వ గలుగుతారు బాబయ్యా?

క. మాకు భగవంతుడు కల్పించిన వృత్తితో బ్రతకడం తప్పే అంటావా ఏమిటి?

రై. ఏం కలిపించాడు బాబూ! మాయదారి దేముడు? సెప్పం డిందారి?

క. మాకొక్కరికే కాదు, ప్రతి ఒక్కరికీ ఒక్కొక్క వృత్తిని కల్పించాడు దేముడు! అది పుణ్యమే గాని, పాపమే గాని, హింసే గాని, అహింసేగాని, దాన్ని చేస్తే తప్పు లేదు! తెలుసా?

రై. ఒక రిద్దరిది సెలవియ్యండి బాబు!

క. ఎవరి వృత్తిని అడుగుతావో అడుగు, నేను చెబుతాను

*(గుండె బాదుకొనును)*

రై. బామ్మర్లకేం వృత్తి కలిపించాడండి బాబూ! దేముడు?

క. వివాహాలు చేయించుకోమనీ, విద్య చెప్పుకోమని. కల్పించాడు,

రై. రాజులకోనండి బాబయ్యా ?

క. ప్రజలమీద వేర్వేరు పన్నులు వేసి తమ రాజ్యంలోని ధన లోపాన్ని భర్తీ చేసుకో మన్నాడు!

రై. కోమట్ల కోనండి బాబయ్యా ?

క. వ్యాపారం చేసుకోవడం. వ్యవసాయం చేసుకోవడం వారి ముఖ్య వృత్తే అనుకో! కాని తక్కువ తూకాలు తూచేవాళ్ళూ, తప్పుడు పద్దులు వ్రాసే వాళ్ళూ, నూటికి 'నోటు' వ్రాయించుకొని, నూటికి పదో పాతికో తక్కువిచ్చి, 'ఝూటా' మాటలు మాటలాడే వాళ్ళు కొందరేనా లేరంటావా ఏమిటి ?

రై. ఎందుకు లేరండి బాబు! మరైతే, వైద్యులకోనండి బాబయ్యా ?

క. వైద్యులకి రోగులు లేకపోతే రోజే గడవ దనుకో ?

రై. వకీళ్ళకో బాబయ్యా ?

క. వకీళ్ళకి వాది ప్రతివాదులే వజ్రాల గనులు.

రై. జోతిసుకుల కోనండి బాబయ్యా ?

క. ముహూర్తం పెట్టించుకున్న వాళ్ళందరూ వారికి బహుమానాలో, దక్షిణ తాంబూలాలో ఇవ్వాలు టోయి! వెంకన్న కాపూ ?

రై. బడి పంతుళ్ళకేమీ లేదను కుంటూ నుండి బాబయ్యా!

క. వాళ్ళకేమోయి! 'ఫేలు' చేస్తానని పిల్లలిని బెదిరిస్తే పది మంది ప్రైవేటు చెప్పించుకోడాని కొస్తారు!

ఒక్కొక్కడు పదే సిచ్చినా నూరు రూపాయి లవుతుంది నెలకి !

రై. పోలీసు వాళ్ళకో బాబయ్యా !

క. పోలీసు వారి ఇనాం ముట్టకపోతే మన పేర్లు కేడీ దొంగల లిస్టులో ఉంటుంది ! తెలుసా ?

రై. పోస్టు బంట్రోతులకో బాబయ్యా !

క. పోస్టు వాళ్ళకి బహుమానం ముట్టకపోతే మన పేర ఒచ్చిన 'మనిఆర్డరు' లన్నీ తిరిగి వెళ్ళిపోతాయి ! మన ఉత్తరాలు చెత్తకుండీలో మెత్తగా హాత్తుకుంటాయి !

రై. ఆఫీసులో గుమాస్తాలకో బాబయ్యా ?

క. పైవాళ్ళందరికీ సంవత్సరాని కొక్కసారి ఇస్తే, గుమాస్తాలకు ప్రతి 'ఫైలు' కి వేర్వేరుగా దక్షిణా-తాంబూలాలు ఇచ్చుకోవలసిందే !

రై. అన్నింటి కన్నీ చెపుతుండారు మారాజులు ! అయితే నుండి ! ఏమీ వృత్తి లేనో రెవరేనా ఉన్నారా బాబు ! నాకు తెలివక్కడుతా బాబయ్యా !

క. లేకేమోయి ! అల్లాంటి వాళ్ళల్లా ఒక్క రైతు బిడ్డలే అనుకో! ప్రజలే కాదు, ప్రభుత్వమే కాదు, బ్రాహ్మడే కాదు, భట్టేకాదు, కర్ణమే కాదు, మునసబే కాదు, పశువులే కావు, పక్షులే కావు, అందరికీ అలుసైన వాడు రైతొక్కడే అనుకో !

రై. అందరికీ అన్నదాత అంటే రైతుబిడ్డే అనకూడదండి !

క. మా కర్ణం మునసబులకి ఇష్టదైవ మెవరంటే, రైతు బిడ్డే అనుకో! రైతు లేకపోతే, మా వాళ్ళందరూ ఒక్కనాటితో ఖాటికి కాళ్ళు చాపవలసిన వారే అనుకో! ఇంకెందుకు?

రై. అయితే బాబయ్యా! తమరు మాటి మాటికి ఆళ్ళమీద కళ్ళెఱ్ఱచేసి "కారాలు మిరియాలు నూరుతా" రేం బాబు?

క. వేడి చేస్తేనే గాని వెన్నైనా కరుగుతుంది టోయి? వెంకన్నా! మనం కోపం చూపించితేనే గాని వాళ్ళ మనసు కరగదు! అందుకని "అగ్గిమీద గుగ్గిలం" వేస్తూవుండాలి!

రై. అయితే దేముడు మీకీ కవిలె కట్టలు 'కాస్టాబు' కట్టలు ఇచ్చాడన్న మాటేనాండి?

క. "దస్త్రం లేని కర్ణపోడు శస్త్రం లేని కర్ణుడు" సమానం అన్నారు పెద్దలు!

రై. అందుకేగా వోసుండి "ఆకలి గొన్న కర్ణం ఖాత కవిలె కట్టలు తడిమా" డంటారు బాబూ! నిజమే నండి ఆమాట!

క. పెద్దలు అనుభవించి చెప్పిన మాట అబద్ధమవుతుందా! వెంకన్న కాపూ!

రై. నన్ను మాత్రం అనుగ్గరించండి బాబు! ఏదో నాకు తోచింది "చంద్రుని కో నూలుపోగు" ఇచ్చు కుంటా లేరి! అమ్మాయిగారి పెళ్ళికి!

క. నీదే బోణీ బేరం! నీ చేతి బోణీ చాలా మంచిది! ఎన్నో సార్లు చూచానిది వరకు? అంకె చెపితే వ్రాసుకొని అందరికీ చూపిస్తాను. పెళ్లి చేసి ఇల్లు నిలిపిన పుణ్యం మీదే అనుకోండి!

రై. వేలివ్వలేను గాని బాబూ! తాలిబొట్టిత్తాను. ఒక్క శతమానం రాసుకోరి!

క. మంచిది! మీ అనుగ్రహమే కావాలి గాని పైసదేం లెక్క లేండి! వెధవ పైస! అది ఈ వేళుంటుంది రే పోతుంది! (వ్రాసికొని వినిపించును)
మహారాజశ్రీ బోణం వెంకన్న కాపుగారు శతమానం క్రింద ఇచ్చినది నూటపదహార్లు!

రై. ఏమిటి కర్ణంగారు! పదారు పెచ్చేశారు?

క. "కొన్న చోట కొసరమన్నారు పెద్దలు" మీ మన స్ఫూర్తిగా మీరు నూరు ఇస్తే నా మనస్ఫూర్తిగా నేను ఒక్క పదహారేగా కొసరు వేస్త! పైగాను?

రై. పిల్లలుగలోణ్ణి! అంత బరువు మొయ్య లేనండి బాబూ!

క. అంతా మొయ్య లేక పోతే నా మీద పారెయ్యండి! నేనే మోస్తాను ఆ నూట పదహార్లు! మీ కెందుకా బరువు? నేనుండగాను!

రై. మళ్ళీ గొలుసు, పగ్గం మాత్రం తేకండి బాబు!

క. బుద్ధి ఉందా లేదా మీకు! మళ్ళీ చిన్నమ్మాయి పెళ్ళి దాకా దస్త్రాలు శస్త్రాలు వెతకను లేండి! భయ పడకండి!

రై. మళ్ళీ ఉంకోకుండకి ఎసరెట్టుంచావు పెదబాబూ!
దేముండంతవాడవు బాబు నువ్వు!

క. ఏంచెయ్యమంటావు పెద్దకాపూ! మేము సర్కారిచ్చే జీతంతోనే బతుకు తున్నామా? ఆ జీతం మా పై ఖర్చులకీ, ఉద్యోగుల కాఫీ ఉపమా ఖర్చులకేనా చాలదు! మీరే మాకు ప్రభువులు!

రై. "ఏనుగు దాహాన్ని చూరు నీరు తీరుస్తుందా" బాబూ? దణ్ణం పెడతా! మళ్ళీ కలుసు కుంటా లేరి!

క. మీకు శ్రమ ఎందుకూ! నేనే వస్తా లెండి. చందా వసూలుకోసం శలవు.

ఆ.వె. ఉన్నతాధికారి – కున్న యర్థాశను
స్వల్ప ధనము తీర్ప – జాలునొక్కొ?
ఏనుగు కగు దాహ–మింటి చూరున జారు
చూరినీరు దాని – తీరుచునొకొ?



శ్రీరస్తు

# భగవద్గీతలో
## చాయి, కాఫీ, ఉపమాలు.

*" నవదశా ఽధ్యాయము - శ్రీకృష్ణార్జునుల హాస్య సంభాషణము "*

[సమయం ద్వాపరయుగము, స్థానం ద్వారకాపట్టణము]

(పాఠశాలా వార్షికోత్సవాదులలో కళాశాలా, ఉన్నత పాఠశాలా, విద్యార్థులు గాని, ఉపాధ్యాయులు గాని నటించుటకు ఇది ఉద్దేశింప బడినది. దీనిని ముఖ పాఠము చేయజాలని బాల విద్యార్థులు వ్యాస పీఠము మీద గీతా పుస్తకము నుంచుకొని అర్జునుడు దానిని చూచుచు ప్రశ్నించుచున్నట్లును, శ్రీ కృష్ణుడు దానిని చూచి సమాధానమును చెప్పుచునట్లును నటింప వచ్చును.)

*(సంస్కృతము రాని వారు శ్లోకములను, మంత్రములను విడిచినను విడువ వచ్చును.)*

(దీనిలోని హాస్యము వ్యక్తులను అధిక్షేపింపవలయుననిగాని, పరమ పురుషులను పరిహసింప వలెనని గాని, వేదములందు భేదబుద్ధిని కలిగింప వలెనని గాని ఉద్దేశింప బడలేదు. ఇది కేవలము హాస్యరసమును పోషించుటకే లిఖింప బడినదని, తెలిసికొని సజ్జనులు నన్ను మన్నింతురు గాక ! అని ప్రార్థన.

**అ.** బావా ! శ్రీ కృష్ణా , భగవద్గీతలలో నీ సమస్త విభూతులును వర్ణింపబడినవి కాని అందు ఒకటి రెండు లోపములు మాత్రమున్నవని వచించుటకు విచారించుచున్నాను !

**శ్రీ.** అర్జునా ! ఆ లోపము లేవో తెలుపుము ?

మ. నీవలెనే సర్వ వ్యాపకములైన 'చాయి' 'కాఫీ' 'ఉపమా'ల యొక్క స్వరూప స్వభావాదులు, గీతలలో వర్ణింప బడక పోవుట మిక్కిలి శోచనీయమగు విషయము గదా ?

శ్రీ. అర్జునా! గీతలలో దాని ప్రశంస అడుగడుగునను కాన వచ్చును. అట్టి పరిశీలనాత్మక దృష్టి యుండుట అవసరము.

అ. బావా! ఒకటి రెండు స్థలములను వివరించి తెలుపుము,

శ్రీ. "భీష్మ శ్చ ద్రోణ శ్చ జయద్రధ శ్చ" భీష్మః, చ, అనగా భీష్మాచార్యులును, ద్రోణః, చ అనగా ద్రోణాచార్యులును, జయద్రధః, చ అనగా జయద్రథుడు మొదలగు వారందరును 'చాయ' పానము చేయు వారే అని దీని భావము.

అ. దీనిని తయారు చేయు పద్ధతి గీతలలో నెచ్చట నైనను వర్ణింప బడినదా ?

శ్రీ. ఆ విషయము గీతలలో విస్పష్టముగానే చెప్పబడినది. వినుము: "సర్వస్య చా హం హృది సన్నివి ష్టో" అనగా "నేను స్టౌ మీద తయారు చేయబడిన 'చాయ' రూపములో ప్రతి మానవుని యొక్క హృదయ కోశము నందును నివసించి యుందును." అర్జునా! ఇంత కంటెను నీకు గీతలలో నేమి ప్రమాణము కావలెనో తెలువుము ?

అ. మహాత్మా! ధన్యో ऽ స్మి! అనుగృహీతో ऽ స్మి!! శ్రీ కృష్ణా! ధన్యుడనైతిని !

శ్రీ. అర్జునా! "కుత స్త్వే కశ్మల మిదం విషమే సముపస్థితం" నీకీ వ్యామోహమును, ఈ సందేహమును ఏల కలిగెనో తెలియ కున్నది! ఇప్పుడైనను నీ సందేహము తీరినదా ?

అ. యోగీశ్వర !నా సందేహము నివృత్తియైనది! "స్థితో ऽ స్మి గత సందేహః కరిష్యే వచనం తవ" ఇన్ని సంవత్సరముల నుండియు నేను గీతాపారాయణమును చేయుచుంటిని గాని నాకీ విశేషార్థము స్ఫురింపనే లేదుగదా ?

శ్రీ. "గురు శుశ్రూషయా విద్యా" "పరిప్రశ్నేన సేవయా" అన్నట్లు గురువు లేని విద్య యెట్లు శోభిల్లును ?

అ. మహాత్మా ! మిమ్ము నిత్యమును 'చాయి' రూపములో నైనను సేవించుకొనెదను !

శ్రీ. అర్జునా ! నన్ను నిర్గుణ రూపునిగా గాని, సగుణ రూపునిగా గాని, ద్రవ పదార్థమగు 'చాయి' రూపునిగా గాని, ఘన పదార్థమగు 'ఉపమా' స్వరూపునిగా గాని సేవింపవచ్చును. మరియు స్త్రీలు గాని, పురుషులు గాని, వైశ్యులు గాని, శూద్రులు గాని నన్ను సేవించి తరింప వచ్చును. ఇంక భక్తులగు రాజర్షులను, పుణ్యాత్ములగు బ్రాహ్మణులను గూర్చి వేరుగా చెప్పవలెనా ?

"స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః; తేపి యాంతి పరాం గతిం.
కింపున ర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయ స్తథా."

అ. శ్రీకృష్ణా ! ఒక్క లఘు శంక నన్ను బాధించుచున్నది.

శ్రీ. అర్జునా ! లఘు శంకయే గాని, గురు శంకయే గాని కానిమ్ము ?

అ. చాయి, వేదకాలమునందు కూడ కలదా ? దీనిని చెప్పి ఈ నా శంకను తీర్పుము. "నహ్యన్య. స్సంశయ స్యాఽస్య చ్ఛేత్తా నహ్యుప పద్యతే" నా సందేహమును తీర్ప నీ వొక్కడవే సమర్థుడవు !

శ్రీ. అర్జునా ! కృష్ణ యజుర్వేదమున "నమకము" "చమకము" అనునవి కలవు. వానిలో నెవరెవరు 'చాయ' పానము చేయు చుండిరో ప్రమాణము కలదు!

అ. ఒక్క మంత్రమును వివరించి చెప్పుము ?

శ్రీ. "నమ స్సోమాయ చ, రుద్రాయ చ అని నమకమునందును, అగ్నిశ్చమే, సోమశ్చమే, సవితా చ మే, సరస్వతీ చ మే, పూషా చ మే అని చమకము నందును ప్రమాణము కలదు. అనగా ఏకాదశ రుద్రులును, అగ్నిహోత్రుడును, ఇంద్రుడును,

సోముడును, సూర్యుడును సరస్వతి మొదలగు వారందరును 'చాయ' పానము చేయు వారే అని పై వేద ప్రమాణమునుబట్టి తెలియుచున్నది।

అ. శ్రీకృష్ణా ! ఇంతటి ముఖ్య విషయము ఇంత కాలము వరకు మరుగు పడియుండుటకు కారణమేమి ?

శ్రీ. వేదములందు ప్రజలకు గల అనాదరణమే ప్రబల కారణము! కలియుగమునందు రష్యనులు చంద్రలోక ప్రయాణమును, భార తీయులు చాయి పరిశోధనమును చేసి వాని వాని రహస్యములను తెలిసికొనెదరు।

అ. ఇట్టి వింకను ఎన్ని రహస్యములు వేదములలో నిగూఢములుగా నున్నవోగదా ?

శ్రీ. అర్జునా ! నీబోటి 'చాయి' భక్తులు పూర్ణ విమర్శ చేసి వేదముల లోని 'చాయి' 'కాఫీ' ల విషయములను లోకమున కందచేసినచో వేదములు పునరుద్ధరింప బడగలవుగదా ?

అ. శ్రీకృష్ణా ! "కరిష్యే వచనం తవ" నీ ఆజ్ఞను శిరసావహించి 'టీ బోర్డు' ను 'కాఫీ బోర్డు' ను స్థాపించుటకు సముచిత మగు కృషిని సలిపెదను !

శ్రీ. అర్జునా ! నీవట్లు 'కాఫీ' టీ బోర్డు లను స్థాపించుటకు నిరంతర కృషిని సల్పెదవేని "యోగ క్షేమం వహామ్యహం" నీకుటుంబ భారము నంతను నేనే భరించెదను !

అ. చిత్తము ! మహాప్రభో ! నాకు మరియొక 'లఘు శంక' కలుగు చున్నది !

శ్రీ. అర్జునా ! నీవెన్ని పర్యాయములు 'లఘు శంక' చేసెదవో, చేయుము ! అదియును 'చాయి' యొక్క ప్రభావమే అని ఎరుంగుము !

అ. శ్రీకృష్ణా ! ఇంతవరకును 'చాయి' ని గురించియే బోధించితివి గాని కాఫీని గురించి బోధింపలేదు. "శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నం" నీవు నన్ను నీ శిష్యునిగా భావించి "కాఫీ ఉపమాల" రహస్యమును కూడ నాకు బోధింపుము !

శ్రీ. ఓ పాండవ మధ్యమా ! 'చాయి' కంటెను 'కాఫీ ఉపమాలు' అతి ప్రాచీనము లైనవని యెరుంగుము !

అ. శ్రీకృష్ణా ! ఆ వేద ప్రమాణములను వివరించి చెప్పుము.

శ్రీ. "సబుధ్నియా 'ఉపమా' అస్యవిష్టాః" అనియు "అగ్నే గృహపత 'ఉపమా' హ్వా యస్వ" అనియు కృష్ణ యజుర్వేదము నందు 'ఉపమా' ప్రశంస కలదు !

అ. శ్రీకృష్ణా ! 'ఉపమా' ప్రశంస విన్నంతనే నాముఖము ద్రవించుచున్నదిగదా! దీనిని ప్రప్రథమముగ భక్షించిన వారెవరో తెలుపుము !

శ్రీ. దేవత లందరును దీనినే పురోడాశము, సోమపానము, అమృతపానము అను పర్యాయ పదములతో పర్వకాలములందు ఆస్వాందించెడివారు !

అ. మానవులలో దీనిని ముందుగా చవి చూచినవా రెవరు ?

శ్రీ. ఆదికవి వాల్మీకి మహర్షికి 'ఉపమా' మిక్కిలి ప్రియమైనదని శ్రీమద్రామాయణ ప్రమాణమును బట్టి తెలియవచ్చుచున్నది! కవి యొక్క ఆచార విచారములును, అనాటి దేశ కాల పరిస్థితులును కావ్యమునందు ప్రతి ఫలించుట యుక్తమే గదా ?

అ. ఆదికవికి పిమ్మట దీనిని అధికముగా ప్రేమించినవారెవరు?

శ్రీ. మహాకవి కాళిదాసునకు మిక్కిలి ప్రియమగు వస్తువిది యొక్కటియే ?

అ. దానికి నిదర్శన మేమి ?

శ్రీ. "ఉపమా కాళిదాసస్య" అను లోకోక్తియే దానికి ప్రమాణము !

అ. శ్రీకృష్ణా! దాక్షిణాత్యులు కాఫీని అధికముగా పానము చేయుటకును, ఔత్తరాహులు 'చాయి' ని మిక్కుటముగా త్రాగుటకును కారణమేమైనను కలదా?

శ్రీ. దీనికి సంబంధించిన ఒక పురాతన గాధ కలదు — వినుము :— అగస్త్య మహర్షి ద్రావిడ దేశమును, నారికేళ ఫలములను, కాఫీ బీజములను తమ భావి సంతతి వారికి జీవనాధారముగా నొసంగి వానితో కొంత స్థిరాస్తిని, కొన్ని హక్కులను వారికి సంక్రమింప చేసెను.

అ. ఆ స్థిరాస్తి ఏ రూపమున నుండెను?

శ్రీ. 'నీలగిరి' పర్వత రూపమున నుండెను. దానిపై దాక్షిణాత్యులు కాఫీ బీజములను నాటి సేద్యము చేసికొని తమ జీవికను నిర్వహించుకొను చున్నారు!

అ. వారు నారికేళ ఫలముల నెట్లు వినియోగ పరచుకొనుచున్నారు?

శ్రీ. మలబారు 'కోనసీమ' ప్రాంతములందు నారికేళ వృక్షములను ఉపవనములలో విరివిగా నాటి వాని ఫలములను క్రయవిక్రయములు చేసి వాని ద్వారా వారు జీవనోపాధిని నడుపుకొను చున్నారు!

అ. అగస్త్యుడు దాక్షిణాత్యులకు సంక్రమింప చేసిన హక్కులేవి?

శ్రీ. కాఫీ బీజముల సేద్యమును, కాఫీ బీజముల క్రయవిక్రయములను, కాఫీ విక్రయ శాలలను (హోటళ్ళు) నడుపుట, అను మూడు హక్కులును దాక్షిణాత్యులకే చెందవలయునను అధికారమును వారికి అగస్త్యుడు సంక్రమింప చేసెను!

అ. వారు కలియుగమున ఏ నామములతో వ్యవహరింప బడగలరు?

శ్రీ. దేశ విదేశములం దంతటను కాఫీ విక్రయ శాలలకు యజమానులుగా నుండువారందరును 'అయ్యరు' లను నామముతో

ప్రసిద్ధి నందెదరు. కాఫీ బీజములను విక్రయించువారు 'కాఫీ బోర్డు' అను అభిధానముతో, బెంగుళూరు నగరమునందు ప్రఖ్యాతి నందగలరు !

అ. వారిలో విద్వాంసులును, ఉన్నతోద్యోగులును కలరా : వారికిదియే ముఖ్యవృత్తి యా ? వేరు వృత్తి కలదా ?

శ్రీ. వారు వేదశాస్త్ర పండితులగను, న్యాయవాదులుగను, మంత్రులుగను, వేదాంత శాస్త్రజ్ఞులుగను, అత్యున్నతోద్యోగులుగను కలిలో విఖ్యాతి నందగలరు !

అ. దాక్షిణాత్యులును, ద్రావిడులును మహా మేధావు లగుటకు కారణమేమైనను కలదా ?

శ్రీ. బ్రహ్మ సరస్వతియు ఓషధి రూపము నంది వారికి వరమునొసగినట్లు ఒక వైదిక గాధ కలదు !

అ. బావా ! దానిని తెలిపి నా సందేహమును దీర్పవా ?

శ్రీ. అర్జునా ! వినుము :— (1) *దేవతలు యశస్కాములై కురుక్షేత్రమునందు సారస్వత సత్రమును సలిపిరి. దానికి కురుక్షేత్రమే వేదిగాను, ఖాండవ వనమే దక్షిణ వేదిగాను, మరుభూములు ( మారవాడ ) ఉత్కరము ( పెంటగొయ్యి ) గాను ఉండెను.

అ. దాని కాపేరేల సార్థకమయ్యెను ?

శ్రీ. సరస్వతిని ఉద్దేశించి చేయబడు సత్రియాగము కనుక దానికా నామము సార్థకమైనది.

---

(1) *దేవావై సత్ర మాసత. ఋద్ధిథి పరిమితం యశస్కామాః... తేషాం కురుక్షేత్రం వేదిరాసీత్, తస్యై ఖాండవో దక్షిణార్థ ఆసీత్. మరవ ఉత్కరః ఇత్యాది.

అ. దానిలో బ్రహ్మత్వము నెవరు వహించిరి. (2) * బ్రహ్మయే స్వయముగా దానికి బ్రహ్మత్వమును వహించెను.

శ్రీ. బ్రహ్మను విడచి, సరస్వతి నుద్దేశించి యాగము చేయుటకు కారణమేమి ?

అ. సరస్వతి ఆనాటికి కన్యాత్వములోనే ఉండెనని ప్రమాణము కలదు (3) * అందుచే సరస్వతి నుద్దేశించియే వారు సత్ర యాగమును జరిపిరి.

అ. పిమ్మట ఏమయ్యెను ?

శ్రీ. సరస్వతి హవిర్భాగములను గ్రహించుటకు వచ్చి "కన్యాకుమారీ అగ్రము" నకు సమీపమున నివసించెను !

అ. సరస్వతి కన్యాత్యములో నుండి అచట నివసించుట వలననే దాని కానామము సార్థకమైనదా ?

శ్రీ. తాత్కాలికముగా నీవు అట్లు భావించినను భావింపవచ్చును !

అ. పిమ్మట ఏమయ్యెను ?

శ్రీ. విద్యావంతుడును, రూ ప వం తు డు ను, నవయువకుడు నగు బ్రహ్మను చూచి సరస్వతి వరించినది !

అ. "కన్యా వరయతే రూపం" అనునది లోక ప్రసిద్ధమే గదా !

శ్రీ. పిమ్మట సరస్వతి స్వయముగా బ్రహ్మతో నీ విషయమును చెప్పుటకు లజ్జించి దాక్షిణాత్య వృద్ధుల ద్వారా బ్రహ్మకు సందేశమును పంపెను !

అ. నాటి దాక్షిణాత్యులు ప్రతి ఫలాపేక్ష లేక కార్య సంధానమును చేసిరా ?

---

(2) * బ్రహ్మా బ్రహ్మాఽభవ త్స్వయం.

(3) * "పాపీ రవీ కన్యా చిత్రాయు స్సరస్వతీ"

శి౹. స్వార్థము లేని వారు ఎవ్వరైనను ఉందరా ? తమ వంశము లోని భావిసంతతి వారందరును విద్వాంసులును, బుద్ధిమంతులును, ఉన్నతోద్యోగులును కాగలుగునట్లు వారు వరమును కోరుకొని వాణీహిరణ్యగర్భులకు పాణిగ్రహణ మహోత్సవమును జరిపించిరి. ఆ వరప్రభావముననే దాక్షిణాత్యులును, ద్రావిడులును బుద్ధిమంతులగుటకు కారణమని యెరుంగుము.

అ. దానికి "కాఫీ" అను నామ మెట్లు కలిగెను ?

శి౹. సరస్వతియు బ్రహ్మయును సత్ర యాగానంతరము దేవలోకమునకు పోవుచుండిరి. ఇంతలో దాక్షిణాత్యులు వారి జ్ఞాపక చిహ్నముల నేదైన నిమ్మని కోరిరి. సరస్వతి ఓషధిరూపమున బ్రహ్మి అను ఓషధి నొసగెను అదియే "సరస్వతి" అను పేరుతో నీలగిరియందు వర్ధిల్లును.

అ. బ్రహ్మ వారికి స్మృతి చిహ్నముగా నేమి యొసగెను ?

శి౹. బ్రహ్మ కశ్యప సంతతిలోని వాడగుటచే కాశ్యపుడను పేర ప్రసిద్ధి నందెను. కశ్యప ప్రజాపతిచే సృష్టింపబడి సమర్పింపబడినది కనుక అదియే నీలగిరి యందు "కాశ్యపీ" అనియు "కాఫీ" అని యును ప్రసిద్ధికెక్కినది ?

అ. "కాశ్యపీ" శబ్దము "కాఫీ" శబ్దముగా ఎట్లు మార్పు చెందెను ?

శి౹. "తామరసం" అను శబ్దము తెలుగు భాషలో "తామర" అయినట్లును, "పానీయం" అను శబ్దము హిందీభాషలో పానీ అయినట్లును, కాశ్యపీ, శబ్దము మధ్యమాక్షర లోపముచేత "కాఫీ" యని ప్రసిద్ధి చెందును. అదియే శీతమండల వాసులగు శ్వేతముఖుల నోట బడి వికృతినంది 'కాఫీ' అని ఉచ్చరింప బడగలదు ? ఆ ఓషధులే కలియుగమున నీలగిరి కొండలయందు వర్ధిల్లగలవు ! తత్సేవనమేవారు మేధావులగుటకు కారణము.

అ. ఆ కాఫీ దక్షిణమునుండి ఉత్తరమున కెట్లు వ్యాపించినది ?

శి౹. సరస్వతి ఒకా నొకప్పుడు పార్వతీ సందర్శనార్థమై కైలాసమున కేగి తిరిగి వచ్చుచు మార్గ మధ్యమున గల కాశ్మీరము యొక్క ప్రకృతి సౌందర్యమును, అచ్చటి మనోహర దృశ్యములను, చూచి మోహితురాలై అచ్చటనే నివసింపసాగెను

అ. ఆ ప్రదేశము కలియుగమున ఏనామముతో వ్యవహరింప బడగలదు ?

శి౹. "శారదాపీఠము" అను నామముతో నాస్థానము ప్రసిద్ధి నొంద గలదు !

అ. సరస్వతి కచట "కాఫీ" ఎట్లు లభించెను ?

శి౹. ఉదయ మగుసరికి "కాఫీ" లభింపక పోవుటచే సరస్వతి "కాపి కాపి" అని తల్లడిల్లిపోయెడిది !

అ. దాని కేమైనను ఆధారము కలదా ?

శి౹. "కాపి కాపి సరస్వతీ" అను లోకోక్తియే ప్రమాణము.

అ. పిమ్మట సరస్వతికి 'కాఫీ' ఎట్లులభించినది ?

శి౹. అపుడు దక్షిణ దేశము నుండి కొందరిని దాక్షిణాత్యులను' కొన్ని కాఫీ గింజలను, తెప్పించి ఉత్తర ప్రదేశమునందు కూడా సేద్యము చేసి అచట కాఫీ విక్రయ శాలలను సరస్వతి స్థాపింప చేసినది ! పిమ్మట క్రమముగా ఆ సేతు శీతాచల పర్యంతమును కాఫీ వ్యాపించినది !

అ. సరస్వతి అచట ఎంత కాల ముండెను ?

శి౹. శారద కలియుగారంభము వరకు నచటనే యుండి పిమ్మట అంతర్ధానమైనది ! ఆ స్థానమే కలియుగమున "శారదా పీఠము" ను నామముతో వ్యవహరింప బడగలదు !

అ. ఆమె రూప పరివర్తనము నందినట్లే ఆమె పానము చేయు 'కాఫీ' కూడా నామ పరివర్తనము నందినదా ?

శ్రీ. ఆ కాఫీ రసమే కలియుగమున (1) కోకో, (2) గ్లూకోజు, (3) హార్లిక్సు, (4) బార్లీ, (5) బోరను వీటా, (6) ఓవల్టీను, (7) రాగీమాల్టు, (8) వింటో, (9) లస్సీ, (10) బాదంఖీర, మొదలగు నామములతో వ్యవహరింప బడగలదు!

అ. 'కాఫీ' కి జీవిత చరిత్ర ఉన్నట్లే 'చాయి' కి కూడ జీవిత చరిత్ర కలదా ?

శ్రీ. అన్ని జీవిత చరిత్రలకును 'చాయి' కాఫీ' ల జీవిత చరిత్రలే కలియుగమున మార్గదర్శకములు కాగలవని ఎరుంగుము!

అ. శ్రీకృష్ణా! దాని చరిత్రను కూడా వివరించి నాకు చెప్పుము, మరియు 'చాయి' ఉత్తర ప్రాంతము నందు అధికముగా వ్యాప్తి నందుటకును, ఈరానీయులచే తయారు చేయబడిన 'చాయి' మిక్కిలి రుచికరముగా నుండుటకును కారణమేమైనను కలదా?

శ్రీ. ఆర్యులు 'ఈరాను' లో నివసించుచుండగా 'చాయి' ని అధికముగా పానము చేయుచుండిరి!

అ. ఆ 'చాయి' వారికి ప్రథమమున నెట్లు లభించెను ?

శ్రీ. 'చాయి' ప్రథమమున చైనా దేశమునందు ఉద్భవించి క్రమముగా 'ఆసియా' 'యూరపు' ఖండములందును అస్సాము నందును వ్యాపించెను! వారినుండియే ఈరానీయులకును ఆర్యులకును "చాయి" లభించినదని ఎరుంగుము.

అ. అచటి నుండి "చాయి" భారతదేశమున కెట్లువచ్చెను ?

శ్రీ. ఆర్యులు ఖైబరు కనుమల గుండా భారతదేశమునకు వచ్చిరిగదా! వారు తమతో కొన్ని పశువులను "చాయి" బీజములను చాయి నిర్మాణమునందు సిద్ధహస్తులగు ఈరానీయులను తీసికొనివచ్చి గంగా సింధు మైదానమునందు నివసింప జొచ్చిరి!

అ. అది అచ్చటి నుండి దక్షిణమునకు ఎట్ల వ్యాపించినది ?

శిO. అయోధ్యా ప్రజలు ఆర్యులను సందర్శించుటకు పోయి వారి నుండి చాయి మహిమను తెలిసికొని కొన్ని చాయి బీజము లను అయోధ్యా పట్టణ ప్రాంతమున నాటి సేద్యము చేయ సాగిరి ?

అ. చాయి, అచటినుండి ఇంకను దక్షిణమున కెట్లు వ్యాపించెను ?

శిO. శ్రీరామచంద్రుడు అరణ్యవాసమునకు పోవుచు తనతో కొన్ని "చాయి" బీజములను తీసికొని పోయి పంచవటీ క్షేత్రము నందును, పర్ణశాలకు నాల్గు వైపులను నాటించెను. సీతామహా లక్ష్మి దానికి తగిన దోహదము నొసగిన దని ఎరుంగుము.

అ. అచటినుండి ఋశ్యమూక పర్వత ప్రాంతమునకును, కిష్కింధా రాజ్యమునకును 'చాయి' ఎట్లు వ్యాపించినది ?

శిO. హనుమంతుడు శ్రీరామునికిని, సుగ్రీవునికిని స్నేహము సమ కూర్చునపుడు శ్రీరామునుండి "చాయి" పత్రంబుల యొక్క మహిమను తెలిసికొని ఋశ్యమూక పర్వత ప్రాంతము నందును కిష్కింధా ప్రాంతము నందును వానిని నాటించెను.

అ. అచటి నుండి భూమండలము నందంతటను "చాయి" ఎట్లు వ్యాపించినది ?

శిO. వానరులు సీతాన్వేషణార్థము బయలు వెడలుచు తమతో కొన్ని 'చాయి' బీజములను పత్రములను తీసికొని పోయి భూమండ లమునందంతటను వ్యాపింప చేసిరి !

అ. వారు భూమండలము నందు వ్యాపింప చేయుటకు కారణ మేమై నను కలదా ?

శిO. కార్య సాధనమునకు 'చాయి' ప్రధాన సాధనమని ఎరిగియే వారు తమతో దానిని తీసికొని పోయిరి !

అ. దానినుండి వారికేమైనను లాభము చేకూరినదా ?

శ్రీ. సంపాతియను గృధరాజు వానరు లొసగిన 'చాయి' ని పానము చేసిన మీదటనే, సీత అశోకవనమున కలదని దూరదృష్టితో చూచి చెప్పగలిగెను !

అ. సంపాతి చెప్పకుండినచో వానరులు తెలిసికొనజాలరా ?

శ్రీ. అతడు చెప్పకుండినచో వానరులందరును, ప్రాయోపవేశమున మరణింప ఎలసిన వారేగదా ?

అ. ఆహా ! 'చాయి' ఎంత మంది వానరుల ప్రాణములను కాపాడినది ! అందులకే " కలౌ కాఫీగత ప్రాణాః " అను సూక్తి త్రికాలా బాధ్యముగా నిలిచి యున్నది ! శ్రీకృష్ణా ! 'చాయి' అచటి నుండి లంకాపట్టణమునకు ఎట్లు వ్యాపించెను ?

శ్రీ. హనుమంతుడు లంకా పట్టణమునకు పోవునపుడు తనవెంట కొన్ని 'చాయి' బీజములను తీసికొనిపోయి లంకాదహనానంతరము అచట చల్లి వచ్చెను. పీనుగు పెంటలతో గూడిన లంకా పట్టణ ప్రాంతము ఎరువులు వేయనక్కర లేకయే సారవంతముగా నుండెను; అని ఎరుంగుము !

అ. దగ్ధమైన భూమిలో "చాయి" మొక్కలెట్లు అంకురింపగలిగెను?

శ్రీ. కాలిన భూమియు, ఎండి నెరియలు తీసిన క్షేత్రమును సేద్యమున కుత్తమమైనదని నీ వెఱుంగవా ?

అ. వ్యవసాయ శాస్త్రముకూడ గీతలలో కలదని నేడే నేనెరింగితిని; కృష్ణా ! ప్రజలలో "టీ–కాఫీ" లను అధికముగా ప్రేమించువారెవరు ?

శ్రీ. అర్జునా ! వీరు వారు అననేల ? ప్రతి యొక్క వ్యక్తియును టీ–కాఫీ–ఉపమా లనెడి త్రిమూర్తులను నిత్యమును సేవించువారే !

అ. ఆ త్రిమూర్తి స్వరూపములో నేరూపముననైనను మిమ్ము ప్రజలు సేవించుట మిగుల ప్రశంసార్హము !

శ్రీ. ఈ ధర్మ సూక్ష్మము నెరిగి చాయి—కాఫీ—ఉపమాలను సేవించిన వారికి నిద్రానివృత్తియు, అన్నమునందు విరక్తియు, దేహ బాధానివృత్తియు, కామోపభోగ ప్రవృత్తియు అనెడి చతుర్విధ పురుషార్థములను లభించుటయే కాక, స్వామి సేవా కార్యమునందు ప్రమత్తత, వేతన గ్రహణమునందు అప్రమత్తత, ప్రభువాక్య శ్రవణమునందు అన్య చిత్తత అను శక్తిత్రయమును సమకూడు నని యెరుంగుము!

అ. శ్రీకృష్ణా! ఆమూర్తి త్రయమును నీవలెనే సర్వ వ్యాపకమైనదని యెరింగి నిన్ను ఆ రూపములో కూడ నేను సేవించికొని తరించెను. శ్రీకృష్ణా! మన కాఫీ సంవాదమును శ్రోత్రపేయ ముగా విన్న వారికేమైనను ఫలము కలదా?

శ్రీ. అర్జునా! అధ్యేష్యతే చయ ఇమం 'కాఫీ' సంవాద మావయోః. 'కాఫీ' యజ్ఞేన తేనాహ మిష్టస్యా మితి మే మతిః! అనగా మనచే చేయబడిన ఈ 'కాఫీ' సంవాదమునెవరు శ్రవణానందముగా వినెదరో, వారు 'కాఫీ' రూపమైన యజ్ఞమును చేసిన ఫలమును పొందుదురు. "నిశ్చితం మత ముత్తమం." అర్జునా: ఇదినా నిశ్చి తాభిప్రాయమని ఎరుంగుము!

అ. శ్రీకృష్ణా! 'కాఫీ' సేవకులకు ఇహలోకమున నెట్టి ఫలము చేకూరునో వచింపుము!

శ్రీ. అర్జునా, కాఫీని సేవించువారు తాత్కాలికముగా కాఫీ బిల్లును చెల్లింపకున్నను, చిల్లర కాతాలో బిల్లుల మొత్తములెల్ల పెల్లుగా వ్రాసికొన బడగలవు! 'కాఫీ, చాయి'ల నందించు పిల్లవాడు కాఫీ బిల్ల వద్దకు మెల్లగా వచ్చి బిల్లుల కట్టను చూపగా ఉల్లము ఝల్లు మన నతడు తల్లడిల్లి పోవును! ఆ విషయమును విన్న యిల్లాలు గొల్లున గోలచేయును! పిల్లలు తిండి లేక తల్లడిల్లి పోయెదరు!! దానిని చూచి ఒళ్ళుకాళ్ళు చల్లబడుటయేకాక కాఫీ చాయి, ఉపమాలయొక్క ఋణత్రయమునుండి విముక్తి నందు

టకు మార్గాంతరమును గానక మెల్ల మెల్లగా కొందరు నాపరం ధామమునకు చేరుకొందురు! ఇహలోకమునందు కాఫీ భక్తులు పొందునట్టి మహా ఫల మిదియే! దీనితో నీ సందేహము తీరినదా?

అ. "స్థితోఽస్మిగతసందేహః కరిష్యే వచనం తవ!"
శ్రీకృష్ణా! నాసందేహములన్నియును తీరినవి! 'కాఫీ' యజ్ఞము యొక్క ప్రచారమును భూలోకముననేను విరివిగా నొనరించెదను!

శ్లో. యత్ర కాఫీ, శ్వరో 'అయ్యర్'—యత్ర కాఫీ ధరో 'గిరాక్'!
తత్ర 'కాఫీ' 'చాయి' 'బిల్లుః; 'వృధా ఖర్చు' ర్మతి ర్మమ.

అ. కం. ఇందు గల దందు లేదని
సందేహము వలదు 'చాయి'—సర్వోపగతం
బెందెందు వెదకి చూచిన
నందెందే కలదు 'కాఫి'—అయ్యరు హోటలున్.

ఇతి శ్రీ సత్యనారాయణ ప్రోక్తాసు సత్యాసత్య సమ్మిళితాసు
స్వకపోల కల్పితో పనిషత్సు, కాఫీ పర బ్రహ్మ విద్యాయాం,
భోగ శాస్త్రే వేష ధారక కృష్ణార్జున సంవాదే
కాఫీ ప్రాప్తి యోగో నామ నవ దశోఽధ్యాయః!

హరిఃఓం తత్సత్
శ్రీకృష్ణ 'అయ్యరా" ర్పణమస్తు



శ్రీ ర స్తు.

# గర్వానికి వైద్యం - శర్వాని సేద్యం

*[ గణపతి కుమారస్వామి కందుకక్రీడ (బంతి ఆట) సలుపుచుందురు. భృంగీశ్వరుడు గణపతికిని, నందీశ్వరుడు కుమారస్వామికిని సహాయకులుగా నుందురు. నలువురును వస్త్రములను ధరించి విభూతి, రుద్రాక్ష మాలికలు, గంధము, యజ్ఞోపవీతములను ధరించి యుందురు. ]*

కు. గణపతీ! వేయుము బంతిని!

గ. వేయుచున్నాను జాగ్రతగా పట్టుకొనుము?

(ఇట్లు 4 సార్లు వేయగా కుమారస్వామి గణపతి ఉదరముపై బంతితో గట్టిగా కొట్టును)

గ. అమ్మయ్యో! (అని నేలను కూలినట్లు పడిపోవును)

(భృంగి వాని శరీరమును తుడిచి లేవతీసి సేవ చేయును)

నం. వాడు ఎప్పుడును అంతే! కుమారా! నీవు బంతిని వేయుము; నేను పట్టుకొనెదను!

భృ. పాపం! దెబ్బలు తగిలి వీడు దుఃఖించుచుండగా మీరాటలాడెదరా?

కు. నందీ! కాచుకొనుము, బంతి వేయుచున్నాను (వేయును)

(గణపతి కుమారస్వామి వద్దకు వచ్చుచుండును)

నం. కుమారా! గణపతి నిన్ను కొట్టుటకే వచ్చుచుండవచ్చును! మన మిరువురమును వానినెట్లయినను ఓడించి ఉడికించవలెను. సిద్ధముగా నుండుము.

గ. కుమారీ! నన్ను నిష్కారణముగా నెందులకు కొట్టితివి?

కు. "ఆటలో అరటి పండు" నేను కొట్టవలయునని కొట్టితినా? అట్టి వాడ వాటలకేల వచ్చితివి? అమ్మతో చెప్పి నిన్ను శిక్షింపించెదను, ఉండుము!

కు. నీకంటెను ముందుగ నేనే అమ్మతో చెప్పి, నిన్ను కొట్టించెదను చూచుకొనుము!

(కుమారస్వామి, నంది ఇరువురును పాట పాడుచూ కర తాళములతో నాట్యము చేయుచు పాట పాడెదరు)

కు.-నం (1) వెనకయ్యోయి! వెనకయ్య! అన్నిటి లోను వెనకయ్య!
నన్నెపుడేమీ అనకయ్య! చెప్పుడు మాటలు వినకయ్య!
నాచే దెబ్బలు తినకయ్య తప్పుడు దారిని చనకయ్య!
పిన్నల చిన్నగ కనకయ్యా! పొట్టను చూచుకు మన కయ్యా!

(2) చిట్టయ్యో! పొట్టయ్య! తెలివికి దెయ్యపు తట్టయ్య!
పుట్టెడు పొణక బుట్టయ్య! పొట్టే బానా పొట్టయ్య!

(3) కలదొక వాహన మెలకయ్య! నెత్తిని జుట్టు పిలకయ్యా!
ఉన్నది అంటే ఉలుకయ్యా! ఉలకవు పలుకవు అలుకటయ్యా!

(4) వెనకయ్యోయి–వెనకయ్యా!

గ. అమ్మా కుమారిని చూడుము! నన్నేమి చేయుచున్నాడో!

కు. నేను కాదే జననీ! వాడే ముందుగ
నన్ను ఏమి చేసెనో విచారింపుము

(పార్వతి కోపముతో ప్రవేశించును)

పా. ఏమిరా! కుమారా! అన్నయ్య నట్లు చేయవచ్చునా?

కు. అమ్మా! గణపతియే ముందుగా నాకన్నులను పన్నెండిటిని లెక్కించినాడమ్మా!

పా. ఏమి గణపతీ! నీ సోదరునట్లు చేయుట నీకు యుక్తమా?

గ. అమ్మా! వాడే నా తొండమును గజము బద్దతో కొలిచినాడే!

పా. ఏమిరా! కుమారి! నీవు దుష్టుడవు. కయ్యమునకు కాలు దువ్వెదవు! మాయ పన్నాగములు పన్నెదవు! (గణపతి వైపు చూచి) గణపతీ! దుష్టులకు దూరముగా నుండవలయును? నీవు వాని జోలికి పోకుము!

(గణపతిని దగ్గరకు తీసికొని బుజ్జగించును)

కు. వాడు నీకు ప్రియ పుత్రుడు! కనుక వానిని శిరమున నెక్కించుకొనెదవు! నాన్నగారితో మీఇద్దరి విషయమును చెప్పకుందునా?

పా. ఏమీ! ఇటు రమ్మ నేనిప్పుడే చెప్పెదను!

(కొట్టపోగా పారిపోవును)

(తనలో) ఈ బాధ నేను పడజాలకున్నాను! వీరి కలహములను తీర్పలేక నా "తల ప్రాణము తోకకు వచ్చుచున్నది" గదా! పిల్లలగన్న తల్లుల కందరకు నుండవచ్చునా! ఈ బాధ? నాకే వచ్చినదా? తెలియదు!

(పార్వతి ఆలోచించుచుండగా శివుడు ప్రవేశించును)

శి. ప్రాణేశ్వరీ! ఏమో దీర్ఘాలోచన చేయుచున్నావు?

పా. ఈ బాలుర కలహములను తీర్పజాలక బాధపడుచున్నాను! మీరెచ్చటికో వెళ్ళిపోయెదరు! పిల్లలను మీరు మందలింపరుగదా! వారి భవిష్యత్తు తల్లి తండ్రులమీదనే ఆధారపడియున్నదిగదా?

శి. "గృహిణీ గృహ ముచ్యతే" ఇల్లు ఇల్లాలిదిగదా! భక్తుల కోర్కెలను తీర్చుటకు వెళ్ళవలదా! ప్రేయసీ!

పా. భక్తుల కోర్కెలను తీర్చెదరు గాని బాలురను తీర్చిదిద్దరు గదా!
వారిని చక్కబరచి నా మనస్సునకు శాంతిని కలిగింపుడు!

శి. బాలుర కలహముల కింతగా పరితపింపవలెనా!

పా. పిల్లల జగడముల నటుండనిండు: మన గృహమున ఒకరితో
నొకరి కెంత మాత్రమును పడుటలేదు!

శి. ఎవరెవరికి పడుటలేదో తెలుపుము?

పా. నా వాహనమునకును (సింహము) మీ వాహనమునకును (వృష
భము) ప్రాణవైరమే గదా!

శి. అది బ్రహ్మ నిర్మితమైనది! దానికి నేనేమిచేయగలను?

పా. గణపతి వాహనమును మీ నాగాభరణము (పాము) పట్టి జూచు
చుండును గదా!

శి. అది జాతివైరము. దానిని మాన్ప మన శక్యమా?
పా. కుమారస్వామి వాహనము (మయూరము) మీనాగాభరణములను
చీల్చి చెండాడుచుండును! దానికిని అదే సమాధానమా?

శి. ఇంతకును నీ ఉపన్యాససారాంశ మేమి?

పా. గృహ కలహములే మన దారిద్ర్యమునకు కారణము! బాల్యమున
బాల బాలికలను సన్మార్గమున నడపుట మాతా పితరుల కర్తవ్యము!

శి. తండ్రికంటెను తల్లికే ఆ విషయమున నెక్కువ బాధ్యతకలదు?
ఆదియందును అవసానము నందును జ్ఞానప్రదాత్రి శ్రీమాతయే

పా. ఆ బాధ్యతను నేను నిర్వహించుచునే ఉన్నాను. కుమారుల
నెట్లయినను సరియైన మార్గమున పెట్టవలయును?

శి. వాని గర్వమునకు మంచి వైద్యము కలదు ! నేను భవ రోగ వైద్యుడను ! ఓ కుమారులారా ! ఇటురండు.
(ఇరువురు వచ్చెదరు) (గణపతి నమస్కరించి నిలుచుండును)

కు. ఏమి నాన్నగారూ ! (గర్వంగా రొమ్ము విరుచుకొనును)

శి. మీకొక ఉద్యోగము ఒసగబడును: దానికొక పరీక్షకలదు. దానిలో నెవరుత్తీర్ణు లయ్యెదరో వారే దాని కర్తలు !

కు. (గర్వముతో) ఆ పరీక్ష ఎట్టిదో తెలుపుడు !

శి. ఏడు గడియలలో భూప్రదక్షిణము చేసి రావలయును !

కు. నేను నామయూర వాహనముమీద 5 గడియలలోనే చేసివచ్చె దను: (సంతోషముతో వెడలిపోవును)

(వినాయకుడు విచారముతో తల్లివద్దకు వెళ్లి దుఃఖించును) నిలువబడును)

పా. గణపతీ! దుఃఖించెదవేల ?

గ. జననీ: నేనీ పరీక్షలో నుత్తీర్ణుడను కాజాలను: (దుఃఖించును)

పా. (తనలో) పాపము: వీనిపరిస్థితి నాకెంతయును కరుణను కలిగించుచున్నది: గణపతియన నాకెందులకో ఎక్కువ ప్రేమ: దానికి వాని నడవడియే కారణము కావచ్చును ? సేవాశు శ్రూషలను చేయుచు, చెప్పినట్లు విను కుమారుని ఏతల్లి ప్రేమింప కుండును! వీనికెట్లయినను ఆ ఉద్యోగమును ఇప్పించ వల యును!) (ప్రకాశముగా) గణపతీ: ఇటు రమ్ము (వచ్చి నమస్క రించును)

పా. (వాని చెవిలో ఏదో చెప్పును. గణపతి సంతోషముతో వెడలి పోవును)

శి. ఏమి ప్రాణేశ్వరీ: ఏమో ఆలోచించు చుంటివి !

పా. మన దారిద్ర్యమునకు నివృత్తి ఎన్నటి కైనను కలదా! అనియే ఆలోచించుచుంటిని: "దరిద్రునికి ఆకలి ఎక్కువట" నిజమే!

శి. నిజమే, నాకు మహానివేదనకు మానిదుండవలెను! నాది నేనే చెప్పుకొనిన తప్పేమి?

పా. ఒక్క ముఖమునకు మానిదైనచో పంచ ముఖములకు రెండు పూటలకు ఎంతయో ఊహించుకొనుడు. కుమారుడు షణ్ముఖుడు: "యధా పితా తధా పుత్రః" అను సూక్తి నిజమే!

శి. గణపతి లంబోదరుడు, గజముఖుడు! గదా?

పా. నా వాహనమునకు, మీ వాహనమునకు ఎన్ని వనములైనను చాలవుగదా! పశు, గ్రాసములకు?

శి. నా భూషా భుజంగములను (పాములు) కుమారుని మయూరము భక్షించుటచే నా శ్రమ బ్రహ్మకెరుక!

పా. మీ ఆభరణ సర్పములు గణపతి వాహనమును నిత్యమును భక్షించుచుండగా గణపతియును మీవలెనే బాధపడుచున్నాడు! దీనికేమైనను నివారణోపాయము కలదా?

శి. నేను దివ్యదృష్టితో నాలోచించెదను! నా సమాధికి భంగమును కలిగింపకుము! (కనులు మూసికొనును) ఇంతలో కుమారులిద్దరును. వచ్చెదరు)

కు. అమ్మా! నేను ముందుగా భూప్రదక్షణము చేసివచ్చితిని! నాకే ఉద్యోగము లభింపవలెను!

గ. జననీ! నేనే వానికంటెను ముందుగా భూవలయమును చుట్టి వచ్చితిని!

పా. నాన్నగారు సమాధి నుండి లేచి దానిని నిర్ణయించెదరు. గోల చేయకుడు!

(శివుడు కనులు తెరచును) (గణపతి నమస్కరించును.)

గ. కు. నాన్నగారూ ! నాదే ఆ ఉద్యోగము! (ఇద్దరును ఒకేసారి పలికెదరు )

శి. గణపతీ! నీవు భూప్రదక్షిణము చేసినట్లు సాక్ష్యమేమి ?

గ. కుమారునే ప్రశ్నింపుడు!

కు. నాన్నగారూ! వీడు క్షీరసాగరమువద్ద గోవు ప్రసవించుచుండగా, శోధ్యము చూచుచు నుండెను ! నేనే ముందు చేసివచ్చితిని!

గ. శోధ్యముకాదు నాన్నగారూ! ఆ గోవునకు ప్రదక్షిణము చేసినందు వలన నాకు భూప్రదక్షిణ ఫలము లభించినది! కనుక నేనే వాని కంటె ముందుచేసి వచ్చితిని !

కు. నీకీ ధర్మ రహస్యము నెవరు చెప్పిరి?

గ. (తల్లి వైపు మౌనముగా చూచుచు నిలుచుండును)

కు. అమ్మా ! వానికేదో రహస్యమును చెప్పితివా !

పా. అవును! ఉన్న ధర్మమునే చెప్పితిని!

కు. ఉన్నదైనచో నాకేల చెప్పలేదు ! అమ్మా ! తనయులయందు తల్లికి ఇంత పక్షపాతమా !

పా. సేవా శుశ్రూషలు చేయు కుమారుని మాతా పితరులు మిక్కిలి ప్రేమింతురు! దానిని పుత్ర ప్రేమ అనవలయునేగాని పక్ష పాత మనరాదు! నీగర్వమునకు తగిన వైద్యము ఇదియే!

కు. ఏమండీ! నాన్నగారూ! పరీక్షలో నెవరుత్తీర్ణులైరి ?

శి. గణపతియే పరీక్ష యందుత్తీర్ణుడయ్యెను. వానికే ప్రమథ గణాధి పత్యమొసగ బడగలదు!

కు. (తనలో) మాతా పితరుల మాట వినకపోయినందులకు నాకు తగిన ప్రాయశ్చిత్తమే జరిగినది! (ప్రకాశముగా) అమ్మా: నాకు కూడ ఏదైనను ఉద్యోగము నిప్పింపవా!

పా. నీ దుర్బుద్ధియే నిన్ను చెరుపుచున్నది! క్రోధాహంకారములు కలవానికి ఉద్యోగమిచ్చినచో ప్రజలను పీడించుకొని తినును!

శి. కుమారా! నీ గర్వమునకు తగిన ఫలము లభించినది గదా!

కు. నాన్నగారూ! బాల్య చాపల్యముచేత నేను చేసిన అపరాధమును మన్నింపుడు! (నమస్కరించును)

శి. నాకు కాదు. ముందుగా నీ మాతృదేవతకు నమస్కరింపుము పిమ్మట నాకు! మాతృదేవోభవ, పితృదేవోభవ! అవిగదా శృతి! (కుమారుడు తల్లికి నమస్కరించును)

పా. కుమారా! నాకు కాదు! జేష్ఠ భ్రాత పితృసమానుడు గదా! వానికి నమస్కరించి క్షమాభిక్ష వేడుకొనుము!

కు. (సందేహించుచుండును)

పా. అన్నను ఆక్షేపించుట తెలియును గాని నమస్కరించుట తెలియదా? అందులకే సందేహించు చున్నావా.

కు. (గణపతికి నమస్కరించి) అన్నా! నా తప్పులను మన్నింపుము.

గ. సోదరా! ఇటురమ్ము! పెద్దల గౌరవించుట, మాతా పితరులను సేవించుట బాల బాలికల కర్తవ్యము!

కు. అన్నా! మీ ముగ్గురి ఆజ్ఞలను నేను శిరసావహించెదను. నాకు కూడ ఏదైనను ఉద్యోగము లభించునట్లు చేయుము.

శి. (తనలో) వీని చిత్తము పశ్చాత్తాపముచే పరిశుద్ధము అయినది కుమారా! నీకు దేవసేనాధిపత్యము నొసగుచున్నాను! మీ రిరువురును మీ మీ ఉద్యోగములను నిర్వర్తించుకొనుటకు వెళ్ళవచ్చును.

(ఇద్దరును తల్లి దండ్రులకు నమస్కరించి బుజములపై చేయివేసికొని సంతోషముతో వెడలెదరు)

శి. (తనలో) బాల్యమున ఆతతాయులుగా నున్నవారు యువావస్థ యందు పురుషకారము కలవారగుటకు ప్రపంచమున అనేక నిదర్శనములు కలవు! వీరి చరిత్రలెట్లు పరివర్తనము నంద గలవో చూచెదము గాక!

పా. ప్రాణేశ్వరా! దారిద్ర్య నివారణోపాయమేమైనను గోచరించినదా?

శి. ఒక్క ఉపాయమున్నది కాని అది మనకు సాధ్యమా?

పా. ఏమి ఆ ఉపాయము? వచింపుడు

శి. "కృషితో నాస్తి దుర్భిక్షం" అనిగదా లోకోక్తి!

పా. వ్యవసాయమా! అది మంచివృత్తియే! మనము భుజించి ఇత రులకు గూడ సహాయపడవచ్చును!

శి. వ్యవసాయము ఆదికష్టమ"ని నీవు వినలేదా? దాని కవసరమగు సాధన సామగ్రిని నేనెట్లు సమకూర్చ వలయును?

పా. ఏమేమి సామగ్రికావలయునో వచింపుడు!

శి. భూకర్షణమునకు వృషభద్వయము కావలెనుగదా!

పా. మనవద్ద నొక వృషభమున్నది! యమధర్మరాజు గారి నడిగి మహిషమును ఒకసారి తెచ్చుకొని మన అవసరమును తీర్చికొన వచ్చును గదా!

శి. అట్లే కానిమ్ము! దున్నుటకు నాగలి కావలెనుగదా!

పా. బలరామునడిగి హలమునొక్కసారి ఎరువు తెచ్చుకొన వచ్చును!

శి. దానికి కఱు గోల కావలెనుగదా? అది ఎట్లు

పా. మీ త్రిశూలమును తాత్కాలికముగా దాని కుపయోగ పరుపరాదా?

శి. అట్లే కానిమ్ము! విత్తనములు, పెట్టుబడి మనకుఎట్లు లభించును?

పా. మీకు ప్రాణస్నేహితుడు కుబేరుడు! మీకు ధనమునకు లోప ముండునా?

శి. సత్యమే కాని "సన్యాసి వివాహమునకు సర్వము నెరవే", అన్నట్లు దున్నుటకు పంట భూమియే లేదుగదా?

పా. పరశురాముడు భూమండలము నంతను జయించి యుండెనుగదా! ఆయనయొద్ద బంజరుగా పడియున్న భూమి ఎంతయో కలదు. అది పంటకు పనికివచ్చును! మీరడిగినచో ఆతడు తప్పక యిచ్చును!

శి. వ్యవసాయము చేయుటకు కూలిమనుష్యులు కావలయునుగదా!

పా. మీ ప్రమథ గణములును భూత ప్రేత పిశాచాదులు నెందరో కలరుగదా?

శి. ప్రేయసీ! మహాత్ముల కంటెను నీవు మంచి సలహాలనొసగు చున్నావు! అందులకే "కార్యేషుదాసీ కరణేషు మంత్రీ" అని మహాత్ములు వచింతురు!

పా. ప్రాణనాథా! ఆడుది అబల యని అధిక్షేపించు చున్నారా!

శి. పురుషునికి తోచని విషయములలో మహిళయే మంచి సలహాలనొసగు నని ప్రశంసించుచున్నాను! కాని, పశువులను కాచుటకు గోపాలకులు కావలెను గదా!

పా. మన బాలకులున్నారుగదా! వారా పనిని చేసెదరు.

శి. వారి విద్యాభ్యాసమును మాన్పించి సేద్యమున పెట్టినచో వారి భావి జీవితములు భగ్నము కాగలదు గదా!

పా. ఎంత మంది ప్రజలు అట్లు చేయుటలేదు! వారందరును తమ తమ పరిస్థితులకు వశులై అట్లు చేయుచున్నారు! కాని బాలురను చదివించినచో వారు బాగుపడెదరని వారికి మాత్రము తెలియదా? మనము నట్లె!

శి. నిజమే! అట్లయినచో వారిని తాత్కాలికముగా సేద్యములో ప్రవేశపెట్టి వారిని రాత్రి పాఠశాలలోనైనను చదివించుట యుక్తము: కానిచో బాలుర భావి జీవితము వ్యర్థము కాగలదు!

పా. అరకదున్నుట కెవ్వరైనను కావలెను గదా!

శి. ఆపనిని నేనే స్వయముగా నిర్వహించెదను! కాని అన్నమునకు గృహమునకు వచ్చి పోవుచుండుటకు నాకవకాశము కుదురునా!

పా. ఆపనిని నేనే నిర్వహించి అన్నపూర్ణ యను నామమును సార్థము చేసికొందును!

శి. పశువులు పంట చేలను పాడుచేయునేమో గదా!

పా. నా వాహనము (మృగరాజు) ను కావలా పెట్టవచ్చును!

శి. మూషకములు ధాన్యమును వరిచేలను పాడుచేయునేమో గదా?

పా. ఒక చిన్న మార్జాలమును పెంచిన బాగుండదా?

శి. మార్జాలము నెట్లో సంపాదింపవచ్చును కాని దానికి క్షీరము లెట్లు పోయవలయును!

పా. "పాలొల్లని పిల్లి ఎచ్చటను లభింపదా?"

శి. దివ్యదృష్టితో పరిశీలించి తెలిసికొనెదను (కనులు మూసికొని కొంతసేపులోనే మరల తెరచును)

పా. నాథా! ఏదైనను గోచరించినదా?

శి. భూలోకములో కలియుగమున "పాలనొల్లని పిల్లి" ఒకటి లభింపగలదు!"

పా. ఏ మహాత్ముని వద్ద? అతని శుభనామమేమి?

శి. తెనాలి రామలింగ కవి! ఎరుగవా!

పా. మంచిదే! ఏరువాకకు మంచి ముహూర్తము కుదుర్చవలయును గదా! ఎవరుంచెదరు ముహూర్తము?

శి. బ్రహ్మదేవుని వద్దకు వెళ్లి ఏరువాకకు మంచి ముహూర్తమును పెట్టించుకొని వచ్చెదను.

పా. సర్వసామగ్రిలను సమకూర్చుకొనియే రావలయును "శుభస్య శీఘ్రం" అన్నారు గదా, పెద్దలు!

శి. కుమారులను ప్రయాణ సన్నాహముచేసి వారిని పంపుము. నేను వెళ్లి వచ్చెదను (వెళ్ళును) (ఇంతలో గణపతి పదిమంది ప్రమథ గణములతో మహారాజ వేషమున ప్రవేశించును. ఒకడు ఛత్రమును పట్టుకొనును: ఇరువురు వింజామరలు వేయుచుందురు. భృంగి ప్రధానుడుగా ముందు మార్గమును చూపుచుండును)

గ. (తల్లికి నమస్కరించి) శ్రీమాతా! నీ అనుగ్రహమున నాకు ప్రమథ గణాధిపత్యము లభించినది. ఇట్టి శుభ సమయమున నిన్ను కీర్తించుట నా విధ్యుక్త ధర్మము.

గేయము:- ఏ దేశమేగినా ఏ పీఠ మెక్కినా, శ్రీమాతృ చరణముల సేవింతు నేను. (పాదములకు నమస్కరించును)

పా. కుమారా! నీవు ప్రమథ గణములకును సమస్త విఘ్నములకును అధిపతి వయితివి, దానితో నాకోరిక తీరినది! నీవీ ఉన్నత సింహాసనమున అధిష్ఠింపుము. (కూరుచుండబెట్టును)

గ. తల్లీ! నీవు సింహాసనేశ్వరివి! సింహాసము నధిష్ఠించుచు నీనామ స్మరణము చేయుట యుక్తము గదా!

భృ. సావధాన! హోషియారు !! బారా హుషారు !!!

గ. "శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ !"
(అందరును చెప్పుకొనెదరు)

కం. శ్రీవిద్యకు శ్రీమాతకు
శ్రీ విద్యా దేశికునకు-శ్రీచక్రముకున్
శ్రీ విద్యోపాసకునకు
నేవిధమగు భేదమైన నెన్నక దలతున్.

పా. కుమారా; నీవు సర్వ లోకములచేతను సర్వ కార్యములందును ముందుగ పూజింపబడెదవు గాక, ఇది నా శాసనము "అదౌ పూజ్యోగణాధిపతి" అని గదా సూక్తి!

(ఇంతలో శివుడు ప్రవేశించును)

గ. తల్లీ! నీ ఆజ్ఞను ఆగమములే శిరమున ధరించుచుండును గదా। నేనెంతవాడను! (ఉభయులకును నమస్కరించును)

పా. గణపతి శిరమును మూర్కొని
(తనలో)గుణవంతుడగు కుమారుడు ఉన్నత స్థితియందుండగా చూచిఆనందించు మాతా పితరుల సంతోషమునకు సరిహద్దు లుండునా!

శి. (కౌగలించుకొని) కుమారా! త్రిలోక పూజ్యుడవుకమ్ము!

బృ. అగజానన పద్మార్కం గజానన మహర్నిశం।
అనేకదం తంభక్తానా మేకదంత ముపాస్మహే

(అందరును అనుకరించెదరు)

(అందరుకలిసి) "తుండము నేకదంతమును" పూర్తిగా పాడెదరు.

శ్రీ మాతాకీ జై
శ్రీ మహా గణాధిపతికీ జై
శ్రీ భారత మాతాకీ జై



శ్రీరస్తు

# చిక్కని సారా-చక్కని తారా

(నలుగురు దొంగల సంభాషణము)

బలేరాముడు, సెబాసు రాముడు, రౌడీ రాముడు, దాల్మియా ఫకీరు

సె. ఈయాల మనం బయలెల్లిన యేల మామంచి ఏ లరా! బలేరామన్నా!

బ. ఇంత పెద్ద కన్నం ఈ నదమంత్రాన్ని ఏనాడూ పార లేదు గదర ! రౌడీ రామన్న !

రౌ. అది మన కాళీ కామ్మోరిచలవనరాదురా! ఆ సల్లని తల్లి మనకి తోడు నీడగా ఉండమట్టే గదర, మనకి మంచి మంచి కన్నాలు పారుతుండాయి!

సె. ఆ సల్లని తల్లికి జలసా సేసి, ఆమే మనుసు సల్ల మరచొద్దార ఫకీరన్న!

ఫ. అల్లామియాకీ యాదు సేసుకుంటా జలసా మనా యిద్దారి చలో,

బ. జలసా కేమెం సావాన్లు గావాల్రా! సేబాసన్నా!

సె. నీరా తాగాలని ఏందా మన సయితుండాదే ! రాముడు మామ!

బ. పులికల్లు తాగితే తల పుఱ్ఱె కెక్కి ఎంతోణ్ణైనా తైతక్కలాడి త్తాది గానీ, నీరాలో నిసా ఏముండాదిరా? నీరా అందరె సప్పని నీరే నాయె!

బ. బ్రాందీ. సారా, రంబు, గుడంబా మనకి దొరుకుద్దారా! పోలీ సోరు గిట్ట మనల్ని పట్టుకుంటారేమో గదరా! సెబాసు మామ!

సె. మన సొమ్ము మనం కరుసు మెట్టుకుంటుండంగ, ఈ పోలీసోరి కేమాయిందిరా! బలె రామన్న:

బ. కోరటోరు బీరు, కల్లు, కడేరావు, సేసి మనా యించారంట గదర! అందుకని పోలీసోరు తాగుడు గాళ్లని పట్టుకొని కేసెడు తున్నారంట! ఎరుగవురా?

రా. కల్లు, సారా, కాదన్ననాటి సందే తాగుడు మరీ మరీ ఎక్కువౌతుండ లేదురా! సెబాసు మామ!

సె. ఆ సేగా (డిపార్టుమెంటు) లో పని సేసే వోళ్లందరూ, తాగుడు గాళ్లే కదరా!

బ. జౌగాని! కోడి పుంజుని మరిచిపోబోకురి!

రా. కోడిని మరచిన ఈడిగాడూ, చేడెను మరచిన కోడెగాడూ ఉంటాడారా? సెబాసన్నా!

సె. నంజుదు కేముండాదిరా బలే మామ!

బ. "ఉల్లి లేని కూర తల్లి లేని పిల్ల" ఉండీ మాత్రమేముపయోగ మేలేహే !

రా. చిక్కని కల్లు తాగి చక్కని పాట పాడు కొందారి. ఆగండేహే! కల్లు తెత్తాను! (పోయి కాఫీ, గ్లాసులు తెచ్చును)

(నలుగురు గ్లాసులలో పోసికొని కాఫీ త్రాగెదరు)

(బలేరాముడు పాడుచుండగా అందరును తాగుచు ఆనందించి అభినయించుచుందురు.)

బ. సీ. పాట:- కల్లు కుండా రాయె—కామదేనువ రాయె!
అమరు లందరికి నీ వమృతమంట!

సై. మనమే దేవతలంరా! తాగండి అమర్తం!
సీ. ఆసవారిష్టమ్ము—లని మారు పేరెట్టి
వైద్దు లెల్లరు నిన్ను—వద్ద గొనరే!

రా. దాచ్చారిష్టం కొంచె తీసికొండె హే (పోయిను)

బ. సీ. ఉద్దోగులను రాస-గద్దె ఉండిన వోరు
నిత్తెంబు నొకసేరు—నిన్ను గొనరె!

దా. ఉద్దోగులేటేహే? అందరూ దొంగలే! మనం
రాత్రి చోరీ చెస్తే! హోండ్లు పగలే డాకా
మారాయిత్తారు. తాగండేహే ఇంకో సేరంత!

బ. సీ. జాగీర్లును జమీన్లు సాం రాజ్జెము లునెన్నొ
మంట గలువవె నిన్ను—మరుగు సంది!

సె. మనకేం జమీన్లుండాయిరా! జాగిర్లే నాడో
మంట కలసినాయి! చెడ్డ కాపరానికి ముప్పేటి
తాగండెహే! రెండు డాములు!

బ. ఆ. వె. తాగుబోతులమని తగునటే మము జూప!
తాగకుండు వారు- ధరను గలరే!

దా. గురివింతగింజకేం తెలుత్తాదిరా!
తన మేన నున్న నల్లని మచ్చ?

ఆ. వె. విస్కి, బ్రాంది, రంబు, బీరు, సారా, నీర,
మద్దెమును గుడంబ, మారు పేర్లు!

సె. బలే పాటి నిప్పించార్రా బలే రాముడు మామ?

రా. ఆడిపేరందుకేనేమోరా! బలే రాముడంట!

అందరు కల్లుకి తగ్గ పాటరా! (బైరాగి సాధు వేషంలో ప్రవేశించును)

బై. పాట. పిల్ల తల్లి గొల్లు మనగ- కల్లు మానరా జీవ!
కల్లు త్రాగువార లెల్ల—గుల్లయైరిరా!
(గ్లాసులు దాచిపెట్టి, అందరును మొగ మెగాలు చూచుకొందురు)

బై. పాట. పడుచు పిల్ల జూచి మోహ_పడెద వేలరా! జీవ?
కడుపుఁగన్న బిడ్డలాడ పడుచు లేనురా!
నీకు కడుపుఁగన్న బిడ్డలాడ పడుచు లేనురా!

(నలుగురును లెంపలేసుకొందరు)

బై. కాయముండబోదు మాయ చేయబోకురా జీవ!
ఛాయ వలెను నిన్ను గాచు న్యాయ మేనురా!

(అందరును నమస్కరించెదరు)

బై. అన్నలారా! మద్యపానము చేసిన మహా రాజులెందరో మంట కలిసినారు. వారిని చూచి యైనను మీరు మంచి మార్గము నవలంభింప వలదా?

అం. అయ్యా! బుద్ధి గడ్డి తిని ఈ పాడు పనికి అలవాటు పడ్డాం బాబు! ఇంక మానేత్తాంలేరి బాబు!

బై. ఇంకనైనను మీరు మద్య పానమును మాని మంచి మార్గము నవలంబింపుడు!

అందరు. (వాని పాదములపైబడి నమస్కరింతురు)

పాట. మాయలోన తగిలి కనులు మూయబోకురా జీవ!
మాయ విడిచి భక్తి నాంజనేయుదలపరా!

అందరు. వీరహనుమాన్‌కీ జై! కాశీమాతాకీ జై! భారతమాతాకీ జై!

(అన్ని నాటికలకును భరత వాక్యము)

ఆ. వె. ప్రజలు ధర్మమందు—ప్రవణులౌదురు గాక!
పాపకృత్యము లెడబాయు గాక।
క్షామబాధలేక—జనత మనును గాక!
భారతాంబ కీర్తి—ప్రబలు గాక।

[చక్కని తారను రెండవ భాగములో చూడవచ్చును]

